# భారతి

**1967 జూన్**






## ఎఱ్ఱన - మతసమన్వయము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

## మనస్సులో మారుమూలలు

శ్రీ బుచ్చిబాబు

## మూడునాళ్లాయెరా, ముద్దుగోపాలా!

శ్రీ జి. నరసింహారావు



వ్య వ స్థా ప కు లు

**దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు**

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



జూన్ 1967



సంపుటము: 44 : : సంచిక 6 :

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూన్ 1967

# అంతర్వేది

## శ్రీ సోమసుందర్

ఎంతదూర మేగినన్నా ఎదురుకాని గమ్యములుల
ఎంతసేపు వేచినన్నా కానరాని స్నేహములుల
ఎరుకబడని రహస్యాల పుట్టుమచ్చ లెన్ని కలవు?
ఈ బ్రతుకున కానవాళ్ళు!...తప్పిపోని కళంకాలు!...

నా లోపలి నరాలలో కనలిన ఉద్రేకధునులు
చెవిలోపల యుగయుగాలు చెలరేగిన వేదనిధులు—
ఎఱుకబడని వెన్ని కలవు తమస్సాంద్రరహస్యాలు...
తరుణ చరణ చారణ మంజీర ఘలంఘల ధ్వనులు.

ఎంత యాత్ర సాగించిన నేమి ఫలము కనులు లేక!
వింత సూత్ర పారాయణ మెందుకు మనసందుకోక..
పవలు రేలు పాదాలై నడచు కాలపురుషునితో
చెలిమిలేని బ్రతుకెందుకు—చైతన్యము లేని శిలగ?

కాలము : జాలము కాదని చెప్పినారు కవీశ్వరులు;
మనిషి మత్స్యతుల్యుడు కాడన్నది తాత్పర్యమెగా!
కాలము జవనాశ్వము నరశేఖరు డద్దానిరౌతు
మలుపు బలుపు లెరిగి నడుపవలెను; లేక పడిపోవును!

ఎంత నేర్చుకొన్న నేమి ? ఎంత కూర్చుకొన్న నేమి ?
సుంత మార్పు పొందని దాడెందము పాషాణసమము;
సుందరతర మీ వసుమతి నందనవనమై తనరక
ఖడ్గమృగోద్రగవ్యాఘ్ర కాననమై పోవుటేల?

విజ్ఞానము పెరిగిపెరిగి మనిషికి పిచ్చెత్తుటేల?
భూదాహముతోడ నరుడు అజ్ఞానమ్ము లెత్తుటేల?
పచ్చని యీ లోకము కార్చిచ్చుల పడి గ్రమగ్గుటేల?
నరరూపము దాల్చిన నరకాసురులకు చిక్కుటేల?

ఎంతకాల మీ భువిపై ప్రభుత నెరుప నేమి ఫలము?
కొంతయినా మానవతా హృదయము పెంపొందకున్న.
ఎంత కాలజలధి యీది సాధించిన దేమి ఫలము?
కొంతయినా మమతా కారుణ్య కాంతు లందకున్న.

మనసు నిరాశ్రయమై మసిన కంటకావృతమే
మదిలో పేరాశలున్న మంచిచెడ్డ లరయముగా,
ఆశ జీవబీజము, హృదయానందోత్సవ ఫలమ్మ:
ఆశ లేనిచో జీవిత మఘాతమై చెలగుమా!!

ఎంతదూర మేగిననూ ఎదురు పొడుచు కామనలై
నరుని గుండెలో పిశాచి కడతేరక నిలచియున్న
ఏమి బ్రతుకు? ఏమి ఫలము? ఏ సాధము లిచ్చు సుఖము?
ఏ రహస్య తీరాలకు ఏగిన సాఫల్య మేమి?

ఎంత మనికి గడచినమా ఎలగానము వినిపించక
వింత కోరికల కలలే వైరిపాములై ఆడిన
ఎచట జీవరసానంద, మేది పారవశ్య మింక!
ఏ వశ్యము సాధించితి, మెచట కలదు కైవల్యము!

నిజం సుమీ మనిషి మనసు నిర్మలతారుణ్యరేఖ
నిజం సుమీ వది వదులే తరతరాల కల్పశాఖ
సౌజన్యం చందనమై—సౌహార్దం తిలకమైన
'మనిషి మనసు మహత్తరము, అజేయ వజ్రాయుధము!

---

# ఐహికత్వం - (సెక్యులరిజం)

శ్రీ కల్లూరి బసవేశ్వరరావు

## 1

"సెక్యులర్ స్టేట్" అన్న ఆంగ్ల భాషాపదాలకు 'లౌకిక రాజ్యం' అని అర్థం చెప్పుకొంటున్నాం కనుక 'సెక్యులరిజం' అంటే 'లౌకికత్వం' అనవచ్చును. అయితే లౌకిక వ్యవహారాల్లో కొందరు ప్రవర్తించే లౌక్యమూ, యీ 'లౌకికత్వమూ' ఒకటేనని భ్రమ కలుగవచ్చును. అటువంటి భ్రమకు అవకాశం లేకుండా వుండటానికై 'సెక్యులరిజం' అన్న ఆంగ్ల శబ్దానికి 'ఐహికత్వం' అని అర్థం చెప్పుకోవటం శ్రేయస్కరం. ఒక విషయాన్ని హేతుబద్ధంగా ప్రతిపాదించదలచుకొన్నప్పుడు స్పష్టమైన శబ్దాలను ఎన్నుకోవటం అవసరమే గదా?

ప్రాచీన మానవుడు తనచుట్టూ వున్న భౌతిక ప్రపంచాన్ని అర్థం చేసుకోటానికి యత్నించిననాడే ఐహికత్వం ఆవిర్భవించింది. ప్రాచీన గ్రీకుల సాహిత్యమూ, భారతీయుల వేదాలూ, ఉపనిషత్తులూ పరిశీలించినచో ఆనాటిమానవుల జిజ్ఞాస, సత్యాన్వేషణ అవగతం కాగలవు. వారి జిజ్ఞాస ఫలితంగానే శాస్త్రాలూ, కళలూ మతం ఏర్పడ్డాయి. ఐహికత్వానికి యీ లోకం యదార్థం. యదార్థమైన యీ లోకాన్ని అవగతం చేసుకొనే శక్తియుక్తులు మానవునకు కలవన్న దృఢవిశ్వాసమే ఐహికత్వానికి పునాది.

మధ్యయుగంలో పెచ్చుపెరిగిన మతోన్మాదాన్ని ఎదుర్కొని ఐహికత్వం క్రమేణా ఒక స్పష్టమైన రూపాన్ని సంతరించుకొంది. ఒకప్పుడు మత సంస్థలు మానవ కల్యాణానికి కొంత దోహదం చేసిన మాట వాస్తవం. విద్యావికాసానికీ, దీనజనోద్ధరణకూ మతసంస్థలు అన్నిదేశాల్లోనూ తోడ్పడినట్లు మానవ చరిత్ర చెప్తోంది. అయితే మతం ఆముష్మిక చింతనానికీ, మానవసేవకూ మాత్రమే కట్టుబడివుండలేదు. సాంఘిక, రాజకీయ, వైజ్ఞానికరంగాల్లో మానవుడు కొనసాగిస్తున్న కృషిని తమ అదుపులో వుంచుకోటానికీ, శాసించటానికి మత సంస్థలు తీవ్రమైన ప్రయత్నం చేశాయి. అటువంటి ప్రయత్నం ఫలితంగా మతోన్మాదం లేక మతస్వామ్యం (Theocracy) తలెత్తింది.

హెన్రీ సిడ్జివిక్ అనురచయిత మతోన్మాదాన్ని యీ క్రింది విధంగా నిర్వచించాడు.

"By theocracy we do not mean a state in which god governs, but a state in which persons claiming some special authority to declare the divine will are habitually obeyed on this ground, not only in the ordering of religious worship, but in the administration of secular affairs."

మతస్వామ్యం అంటే ఈశ్వరుడు ప్రత్యక్షంగా పరిపాలించే రాజ్యంకాదు. ఈశ్వర సంకల్పం తమకు తప్ప అన్యులెవ్వరికీ తెలియదన్న కొందరు వ్యక్తుల యొక్క అధికారం మత పూజాది విషయాల్లోనే గాక, మతేతర లౌకిక విషయాల్లోకూడ చెల్లుబడి అయ్యే రాజ్యమే మతస్వామ్యం. 'సృష్టిస్థితిలయాలకూ, మానవనాగరికతా వికాసానికీ ఈశ్వర సంకల్పమే మూలకారణం. మనచుట్టూ జరుగుతూవున్న సంఘటనలన్నీ పరేశ్వరునిలీలలే. ఈశ్వర సంకల్ప వికల్పాలూ, లీలలూ మతాధికారులకూ, మహాత్ములకూ తప్ప అన్యులకు అర్థంకావు. అందువల్ల మతాధికారులకు అన్నివిషయాల్లోనూ విధేయులై యుండటం తప్పనిసరి' అని ఒక సంకుచిత సిద్ధాంతాన్ని మతోన్మాదం ప్రతిపాదించింది. ఈ సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని మతోన్మాదులు తమ అధికారాన్ని నిలబెట్టుకోటానికి అనువైన

ధర్మాన్నీ, సాంఘికాచారాలనూ రూపొందించారు. ఆ ధర్మాన్నీ, ఆ ఆచారాలనూ రక్షించటమే రాజధర్మమని వాటి పాలకులకు ఉద్బోధించారు. అందు కవసరమైన ధర్మశాస్త్రాలనూ, శిక్షాస్మృతులనూ వెలయించారు. తమ అభిప్రాయాలకు వ్యతిరేకమైన అభిప్రాయాలున్నవారిని పాషండులుగానూ, నాస్తికులుగానూ చిత్రించి, వారిని దండించటం అవశ్యకర్తవ్యంగా పేర్కొన్నారు. ఇందువల్ల మత పూజా విషయాల్లో వ్యక్తికి స్వేచ్ఛ లేకుండాపోయింది. మత స్వాతంత్ర్యాన్ని కోరినవారు క్రూరంగా హింసింపబడ్డారు. 'సర్వమతాలూ ఆధ్యాత్మిక జగత్తునుగురించీ, మోక్షసాధనమునుగురించీ బోధిస్తున్నాయి. అందువల్ల అన్నిమతాలూ సమాదరణీయాలే' అన్న సూక్తిని మతోన్మాదం నిరసించింది. అందుచేత మతసహనం, మత సంఘర్షణలు ప్రబలినాయి. క్రైస్తవులకూ — యూదులకూ మధ్య, హిందువులకూ — మహమ్మదీయులకూ మధ్య జరిగిన సంఘర్షణలన్నీ మతోన్మాదం వల్ల జరిగిన దారుణ హింసాకాండను ఉద్ఘోషిస్తున్నాయి. మతాంతరులపట్ల ప్రేమకు బదులు ద్వేషం ప్రజ్వరిల్లింది. హిందువులు తమ మతానికి చెందనివారిని మ్లేచ్ఛులనీ, మహమ్మదీయులు తదితరులను కాఫరులనీ, క్రైస్తవులు తదితరులను 'హిదెన్సు' అనీ దూషించుకొన్నారు. పైగా యితర మతాలవారిని తమ మతంలోనికి బలవంతంగా చేర్చుకోవటం పవిత్రమైన కార్యంగా భావించారు. అందుచేత అనేక మత యుద్ధాలలో మానవచరిత్ర అల్లకల్లోలమైంది. క్రైస్తవ మతానికి మూలస్థానమైన జెరూసలేమ్ పట్టణం మహమ్మదీయులైన అరబ్బుల స్వాధీనంలో వున్నందున ఆ పట్టణాన్ని కైవసం చేసుకోటానికి జరిగిన 'క్రూసేడ్స్' అను మతయుద్ధాల్లో ఎంతమంది నిహతులైనారో చెప్పగలమా? హిందువులు — మహమ్మదీయులు తమతమ మతాలకోసం పోరాడినందువల్ల ఎన్ని లక్షలమంది దుర్మరణం పాలైనారోగదా? ఎంతమంది జైనులూ, బౌద్ధులూ ఉన్మత్త మతావేశానికి బలిచేయబడ్డారో ఎవరు చెప్పగలరు?....అంతదాకా ఎందుకు? నవభారతనేత మహాత్మాగాంధీ మతోన్మాదానికి బలి కాలేదా?

మొత్తంమీద మతోన్మాదంవల్ల మానవాళికి కీడేగాని మేలు జరుగలేదని గట్టిగా చెప్పవచ్చు. (1) మతోన్మాదం తెచ్చిపెట్టిన అనర్థాల్లో మొదటిది మత స్వాతంత్ర్యాన్ని అరికట్టటం. మత విషయంలో ఎవరికివారు తమ అంతరాత్మ చెప్పినట్లుగా నడుచుకోటాన్నీ, ఆరాధనలు, ప్రార్థనలు జరుపుకోటాన్నీ మతోన్మాదం అంగీకరించదు. ఇందువల్లనే మతం పేరుతో దారుణమైన హింసాకాండ జరిగింది. (2) మతోన్మాదం యేర్పాటుచేసిన రాజ్యవ్యవస్థలో పౌరులందరకూ సమానమైన హక్కులు లేకపోవటం రెండో అనర్థం. మతోన్మాదం ప్రకారం రాజ్యాంగం యేదో వొక మతానికి అనుకూలంగా నిర్మాణమవుతుంది. రాజ్యాంగం గుర్తించిన మతానికీ, తదనుయాయులకూవున్న హక్కులూ, అవకాశాలూ యితర మతాలవారికి వుండవు. మత ప్రాతిపదికపై నిర్మాణమైనటువంటి రాజ్యవ్యవస్థలో సర్వమానవ సౌభ్రాత్రం, స్వేచ్ఛ, సమానత్వం లోపించి నియంతృత్వం నెలకొంటుంది. (3) మానవుని ఆలోచనా — భావప్రకటనా స్వాతంత్ర్యాలను నిషేధించి, వైజ్ఞానికాభివృద్ధిని విరోధించటం మతోన్మాదం తెచ్చిపెట్టిన మూడో అనర్థం. మతోన్మాదులు తమ మత సూత్రాల సంకెళ్ళలో, మూఢవిశ్వాసాల్లో మానవుని సత్యాన్వేషణనూ, స్వేచ్ఛాపిపాసనూ నిర్బంధించారు. ఇందుకు నిదర్శనంగా కొన్ని ఉదాహరణలను పేర్కొనవచ్చు. సూర్యునిచుట్టూ భూమీ, యితర గ్రహాలూ తిరుగుతూ వున్నాయన్న సిద్ధాంతాన్ని కోపర్నికస్ అను విజ్ఞాని ప్రతిపాదించాడు. ఈ సిద్ధాంతాన్ని ఋజువుచేసి, బలపరచినందుకు గెలిలియోను మతోన్మాదులు హింసించారు; బ్రూనో అను శాస్త్రజ్ఞుని సజీవంగా దహనం చేశారు. పరలోకాన్నీ, ఆత్మవాదాన్నీ కాదని, ఇహ లోకాన్నిగురించి ఆలోచనలు కొనసాగించిన చార్వాకుడు, అజిత కంబళకేశి వంటి లోకాయతవాదులనేకులు మన దేశంలో వుండేవారు. ఆ లోకాయతవాదులను మతోన్మాదులు హింసించారు; వారి రచనలను నాశనం చేశారు.

అయితే స్వేచ్ఛాపిపాసియైన మానవుడు మతోన్మాదపు నిర్బంధాల నెదుర్కొని, 16, 17 శతాబ్దాలలో మౌలికసత్యాలను కనుగొన్నాడు; క్రొత్త విజ్ఞానాన్ని ఆవిష్కరించాడు. ఆ పరిస్థితుల్లో మానవ స్వేచ్ఛకూ, శాంతికీ భంగకరమైన మతోన్మాదానికి

ప్రతిగా ఐహికత్వం (సెక్యులరిజం) బలపడి, క్రమేణా ఒక స్పష్టమైన సిద్ధాంతంగా రూపొందినది.

## 2

ఐహికత్వాన్ని ఒక సిద్ధాంతంగా వెలయించటానికి అనేకమంది మేధావులు కృషి చేశారు. వారిలో జాన్‌లాక్, రూసో, వాల్టేర్, థామస్‌జెఫర్‌సన్, బెంథామ్, జాన్‌స్టూవర్టుమిల్ చెప్పుకోదగినవారు. భారతదేశంలో మహాత్మాగాంధీ, జవహర్లాల్‌నెహ్రూ, యం. యన్. రాయ్‌లు తమ రచనలద్వారా ఐహిక సమాజ నిర్మాణాన్ని ప్రబోధించారు.

గత రెండువందల యేండ్లలో శాస్త్రీయ విజ్ఞానం అపారంగా అభివృద్ధి చెందింది. విశ్వస్వరూపాన్నిగురించి, సృష్టిక్రమాన్నిగురించి, మనిషికీ—విశ్వానికీ, మనిషికీ—సమాజానికీ వున్న సంబంధాలను గురించి కొత్త సత్యాలు వెలుగులోనికి వచ్చాయి. అంతేగాక మానవుణ్ణిగురించి, అతనిలోని హేతుశక్తి, వాసనలూ, ప్రేరణలూ, భావోద్వేగాలూ మొదలయినవానినిగురించి పరిశోధనలు జరిగాయి. ఐహికవాదులు పెరుగుతూవున్న యీ శాస్త్రవిజ్ఞానాన్నంతా అజిలోకి తీసుకొన్నారు. "ఐహికత్వం అంటే కేవలం మత విషయంలో వ్యక్తికి స్వేచ్ఛ నివ్వటం" అనే సంకుచితార్థాన్ని మొదట్లో చెప్పుకొన్నా, యీనాటి ఐహికవాదులు శాస్త్రీయ విజ్ఞానాన్ని పునాదిగా చేసుకొని ఐహికత్వానికి విస్తృతమైన అర్థాన్ని కల్పించారు. విశ్వం, మనిషి, సమాజం, రాజ్యవ్యవస్థ—వీటన్నింటినీ కలుపుకొనివచ్చే సిద్ధాంతంగా ఐహికత్వాన్ని తీర్చిదిద్దారు.

ఐహికత్వానికి మనిషి ముఖ్యం. ఏ వంకతో నైనాసరే మానవస్వాతంత్ర్యేచ్ఛ అరికట్టబడకూడదని ఐహికత్వం ఉద్బోధిస్తుంది. ఒక వంక మతం ఈశ్వరుని సృష్టించి, సృష్టి కార్యక్రమాన్ని ఆయన చేతుల్లో పెట్టి మానవుణ్ణి ఆయన చేతుల్లోని కీలుబొమ్మను చేసింది. వేరొకవంక ఆర్థిక నియతివాదం (Economic Determinism) ఉత్పత్తి సాధనాలకు మకుటంపెట్టి మానవుని బుద్ధిబలానికి తగిన ప్రాధాన్యం యివ్వలేదు. ఐహికత్వం అన్నిటికీ కొలబద్ద మానవుడే అని చెపుతుంది. మెదడు మానవుడు సృష్టించిన ఉత్పత్తి సాధనా లన్నిటికన్నా గొప్పది. ఈ మెదడు భావాలను సృష్టిస్తుంది. భావాలు అత్యంతశక్తిమంతములు. కాబట్టి ప్రపంచ పరిణామంలో భావా లనే వాటికి ఉచితస్థానం యివ్వకుండా ఏ సిద్ధాంతాన్ని నిర్వచించినా అది అసమగ్రమే అవుతుంది. మానవుణ్ణి ఏదో ఒక శక్తికి బానిసగా మాత్రమే తయారుచేస్తుంది. భావాల స్వభావాన్ని, వాటి శక్తినీ తెలుసుకొని వాటికి సముచిత స్థానాన్ని యివ్వనందువల్లనే పూర్వసిద్ధాంతాలన్నీ మానవునికి తగిన స్థానాన్ని కల్పించలేకపోయినై. మానవుని బుద్ధిబలానికి ప్రాధాన్యం యివ్వనిచో సంఘటనల తీరు, చరిత్రగతి ముందే నిర్ణయింపబడినట్లు అంగీకరించవలసివస్తుంది. ఆ నిర్ణయం ఆర్థికసూత్రాలవల్లనో, ఈశ్వరునివల్లనో జరుగుతుందని నమ్మవలసివస్తుంది. ఇక చరిత్రగతిమీద మానవునకు ఏమి పెత్తనం వుంటుంది? అతడు దానిని యేవిధంగా మార్చగలుగుతాడు? ఐహికత్వం సంఘానికి రూపురేఖలు దిద్దగలిగిన శక్తిమంతునిగా మానవుని పరిగణిస్తుంది.

ఐహికత్వానికి మానవవికాసం ప్రధాన లక్ష్యం. మానవవికాసం యీ జన్మలోనే, యీ జగత్తులోనే సిద్ధించాలి. అందుకు మానవులలోని శక్తియుక్తులూ, యితర లౌకికసాధనాలూ తోడ్పడతాయి. ఈ విషయంలో అలౌకికసాధనాల ప్రసక్తి అనవసరం. ఎరిక్ వాటర్ హౌస్ అను రచయిత మానవ పురోభివృద్ధియే ఐహికత్వంయొక్క గమ్యమంటాడు :—

"The essential principle of secularism is to seek for human improvement by material means alone. It holds that such means......are adequate to secure the desired end."

[See Secularism in Encyclopaedia of Religions and Ethics.]

మనిషికి కావలసినవి స్వేచ్ఛ, సౌఖ్యం, శాంతి. ఇవి ఆచరణలో సిద్ధించాలంటే మానవుణ్ణి కేంద్రంగా భావించాలని ఐహికవాదుల తీర్పు. మనుష్యుల మధ్య సామరస్యాన్ని, సౌభ్రాత్రాన్ని సంపాదించాలి. మతం పేరుతో, సిద్ధాంతాలు, జాతి, వర్గాలుపేరుతో మానవులమధ్య అడ్డుగోడలు యేర్పరచటం మానవత్వానికే అపచారం.

మానవుడు జన్మతః హేతుశీలి. హేతుశీల

ముతోపాటు మానవునిలో స్వేచ్ఛాపిపాస—సత్యాన్వేషణ అనే రెండు మహాప్రేరణలున్నాయి. స్వేచ్ఛాపిపాస మానవుణ్ణి కార్యకారుణ్ణి చేస్తుంది. హేతుశీలం అతనికి మార్గాన్ని చూపిస్తుంది. సత్యాన్ని తెలుసుకోవటం అతని లక్ష్యం. సత్యాన్ని తెలుసుకొనే యత్నంలోనే మానవుడు అనంతమైన జ్ఞానాన్ని సముపార్జిస్తున్నాడు. వాస్తవానికి స్వాతంత్ర్యం, జ్ఞానం, సత్యం—ఇవి ఒకదానికొకటి సంబంధించినవి. ఐహికత్వం స్వాతంత్ర్యేచ్ఛను అన్ని విలువలకంటె ముఖ్యమైందని భావిస్తుంది. ఆది మానవుడు తన బ్రతుకుకోసం పరిస్థితులతో పోరాటం ప్రారంభించాడు. అతడు స్వాతంత్ర్యం కోసంచేసే ప్రయత్నానికి యిదే నాంది. ఆ నాటి నుండి మానవుడు సాధించిన విజయాలన్నీ స్వాతంత్ర్యేచ్ఛవల్ల ప్రోత్సహింపబడినవే. జ్ఞానసేకరణకూ పరిస్థితులను అర్థం చేసుకొని వాటిని జయించటానికి యీ కోర్కె పునాది. స్వాతంత్ర్యంకోసం జరిపే యీ పోరాటంలో మానవుడు 'సత్యం' తెలుసుకోగలుగుతాడు. సత్యం అనేది జ్ఞానంలో వుండేదేగాని, మానవులకు అందని వస్తువు ఏమీ కాదు. జ్ఞానం మానవుల అజ్ఞానాన్ని, మూఢత్వాన్నీ దూరం చేస్తుంది. యేదో ఒక మతంకోసంగానీ, సిద్ధాంతంకోసంగానీ మానవుని స్వేచ్ఛాపిపాసనూ, సత్యాన్వేషణనూ నిరోధించటం మానవవిజ్ఞానవికాసానికే గొడ్డలిపెట్టు. అందువల్ల ఐహికత్వం మానవునికి సంపూర్ణమైన ఆలోచనా స్వాతంత్ర్యాన్ని ప్రసాదిస్తుంది. ప్రతిమనిషీ—విశ్వం, ఈశ్వరుడు, సమాజం, మతం, నీతి మొదలగు అన్ని విషయాలను గురించీ స్వతంత్రంగా ఆలోచించుకోవచ్చు, తన భావాలను ప్రకటించుకోవచ్చు. ఈ విషయాల్లో మానవులందరూ ఏకాభిప్రాయులై వుండాలనుకోవటం పొరపాటు. వారిలో విభిన్నములైన అభిప్రాయాలుండటం సహజం. ఎదుటివారి అభిప్రాయాలను మన్నించే సహనం అవసరం. వారిలో సహజీవనమే ఆచరణయోగ్యం.

'ఐహికత్వం అంటే వట్టి భౌతికవాదమనీ, అది భోగలాలస కిచ్చినంత ప్రాధాన్యం నైతిక విలువల కివ్వదనీ' కొందరనుకొంటారు. ఈ అభిప్రాయం సరియైనదిగాదు. నిజానికి ఐహికత్వం నైతిక విలువలకు ప్రధానస్థాన మిస్తుంది. మతం నైతిక విలువలను బోధించే మాట నిజమే. మానవుడు నీతిగా బ్రతకాలని అది బోధిస్తుంది. అయితే యీ నైతిక విలువల పుట్టుకను అది సిద్ధాంతీకరించలేక మనిషికి విడిగావుండే యే శక్తికో వాటిని ముడిపెడుతుంది. అందువల్ల 'మనిషి నీతిగా ఎందుకు బ్రతకాలి?' అన్న ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేకపోయింది. అవినీతిగా బ్రతకటంవల్ల మనిషి అనేక భౌతిక సుఖాలను పొందగలుగుతున్నాడు. నీతిగా బ్రతకదలచినవాడు అనేక కష్టనష్టాలకు గురిఅవుతున్నాడు. ఎందు కిలా జరగాలి? ఈ ప్రశ్నకు పూర్వజన్మనుగానీ, రాబోయే జన్మనుగానీ జవాబుగా అడ్డుపెట్టటం సరియైన సమాధానం కాదు. కొందరు నీతిగా వుండటం ప్రయోజనకారి అనే సిద్ధాంతాన్ని లేవదీయవచ్చు. కాని ప్రయోజనం అంటే యేమిటి? అనే ప్రశ్న ఉదయించేటప్పటికి యీ సిద్ధాంతం దెబ్బతింటుంది. ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రయోజనాన్ని స్థిరపరచుకోవటం, దానిని సాధించిపెట్టేదే నీతి అనుకోవటం జరుగుతుంది. దీనివల్ల నీతికి నిలబడటానికి ఆధారం లేకుండాపోతుంది. కాబట్టి మానవజీవితంలో నీతికి స్థిరమైన స్థానం ఏర్పరచాలంటే దానిని మానవుని ఉనికిలోనే కనిపెట్టాలని ఐహికవాదుల అభిప్రాయం. నీతిని మానవుని ఉనికిలోనే కనిపెట్టటానికి 'ఆత్మ' అనేదాని పునాదులైన వాసనలనూ ప్రేరణలనూ పరిశీలించాలి. ఇవి క్రమబద్ధమైన ప్రకృతిలోనుండి వచ్చినవే. ప్రకృతి క్రమబద్ధమైన దవటంవల్ల, ప్రకృతినుండి ఆవిర్భవించిన మానవుడు జన్మతః హేతుశీలము కలవాడు. అనగా ప్రతిమనిషిలోనూ యుక్తాయుక్త విచక్షణజ్ఞాన మున్నది. దాన్నే వివేకమంటాం. వివేకంవల్ల యేది ధర్మమో, యేది అధర్మమో అతని అంతరాత్మ ప్రబోధిస్తూవుంటుంది. అంతరాత్మ అంటే మనం తెలుసుకోలేనిదీ, మన ఊహకు అందనిదీకాదు. చైతన్యస్థాయిలో జరిగే జీవిత చర్యే అది. కాగా వివేకచోదితమైన అంతరాత్మ ప్రబోధమే నైతిక ప్రవర్తనకు మూలం. కాని అనేక అవరోధాలవల్ల మనిషి ధర్మబద్ధంగా ప్రవర్తించలేకపోతున్నాడు. ఆ అవరోధాలను తొలగిస్తే మనుష్యుల్లో ధర్మరతి పెరుగుతుందనీ, సమాజం గా నడుస్తుందనీ, ఐహికవాదుల అభి

ప్రాయం. కాగా నీతిగా వుండటానికి మనిషిలోవున్న హేతుస్వభావమే కారణం. అతనిలోవున్న అజ్ఞానమూ, అవివేకమూ అన్యాయానికీ, అవినీతికీ దారితీస్తున్నాయి. నీతిపట్ల ఐహికవాదుల దృక్పథాన్ని వాటర్ హౌస్ మహాశయుడు ఈ విధంగా సూత్రీకరించాడు:—

"Secularism contends that morality is based upon reason and that error lay in knowledge rather than intention."

ఇంతవరకూ చెప్పుకున్నదాన్నిబట్టి ఐహికత్వం సూచించే సమాజంలో స్వేచ్ఛ, సత్యం, అహింస, సహనం, నీతి ప్రధానాంశాలని తేలింది. ఇక ఐహికవాదులు ప్రతిపాదించే రాజ్యవ్యవస్థయొక్క ముఖ్యలక్షణాలనుగూడ పరి ద్దాం.

## 3

ఐహికరాజ్య వ్యవస్థకు వ్యక్తి స్వేచ్ఛయే గీటురాయి. వ్యక్తిస్వేచ్ఛను నిర్మూలించే ఎటువంటి నియంతృప్రభుత్వాన్ని ఐహికవాదులు అంగీకరింపరు. మానవస్వేచ్ఛకూ, ప్రాథమిక హక్కులకూ మకుటంపెట్టే ప్రజాస్వామిక రాజ్యాన్నే ఐహికత్వం కోరుతుంది.

ఐహికరాజ్యం (Secular State) యొక్క ప్రధాన లక్షణాలు మూడు:—1. మత స్వాతంత్ర్యం (Freedom of Religion) 2. సమాన పౌరసత్వం. (Equal citizenship) 3. రాజ్యవ్యవస్థకూ, మతసంస్థలకూ మధ్య సంబంధరాహిత్యం. (Separation of State and Religion.)

### 1. మత స్వాతంత్ర్యం

ఐహికరాజ్యం వ్యక్తులందరికీ సంపూర్ణమైన మత స్వాతంత్ర్యాన్ని ప్రసాదిస్తుంది. వ్యక్తులందరూ అన్నందువల్ల కేవలం ఆ దేశపు పౌరులకేగాదు, ఆ దేశంలో నివసిస్తూవున్న విదేశీయులకు గూడా యీ సూత్రం వర్తిస్తుంది. ప్రతి వ్యక్తీ మత విషయాలను గురించి చర్చించుకోవటానికీ, తనకు నచ్చిన మతాన్ని అనుసరించటానికీ, ఆచరించటానికీ, ప్రచారం చేసుకోటానికి ఐహికరాజ్యంలో అవకాశం వుంటుంది. అతడు ఒక మతంనుండి మరొక మతంలోకి మారవచ్చు. సర్వమత విషయాల్లో, పూజా ఆరాధనాది విషయాల్లో వ్యక్తి అంతరాత్మయే పరమ ప్రమాణం. ఈ విషయాల్లో ప్రభుత్వం యొక్క ప్రమేయంగానీ, జోక్యంగానీ వుండవు. పౌరుల మత విశ్వాసాలు నిర్వచించటంగానీ, వారు ఫలానా మతానికే చెందివుండాలని నిర్ణయించటంగానీ ఐహిక రాజ్యంయొక్క పరిధిలోని విషయాలు కావు. పౌరులు ఏదో ఒక మతంయొక్క అభివృద్ధికై ప్రత్యేకంగా పన్నులు చెల్లించాలని ఐహికరాజ్యం నిర్బంధించదు. అయితే యిటువంటి వ్యక్తిగతమైన మత స్వాతంత్ర్యానికి ఐహికరాజ్యంలో హద్దులు లేకపోలేదు. శాంతి భద్రతలు, నైతికసూత్రాలు, ఆరోగ్యం, ప్రాథమిక హక్కులు (Public Order, Morality, Health and Fundamental Rights) అను నాలుగు హద్దులకు లోబడి ప్రతి వ్యక్తీ సంపూర్ణమైన మత స్వాతంత్ర్యాన్ని అనుభవించగలడు. ఈ హద్దులు హేతుబద్ధములు. కనుక వీనిని మత స్వాతంత్ర్యాన్ని నిరోధించి, నీరసంచేసే అధికారాలుగా భావించ నవసరం లేదు. సర్వమానవ సర్వతోముఖాభివృద్ధిని కోరే ఐహిక రాజ్యం ఎటువంటి నిషేధాలు లేని వ్యక్తిగత స్వాతంత్ర్యాలను ప్రసాదించలేదు. అందువల్ల సమాజ వికాసానికి తోడ్పడే నిషేధాలను నిరసించవలసిన పనిలేదు. ఇందుకు నిదర్శనంగా యీ క్రింది పేర్కొన్న విషయాలను పరిశీలించండి. ఐహికరాజ్యం బహుభార్యాత్వాన్ని నిషేధించటం వ్యక్తిగత మత స్వాతంత్ర్యాన్ని నిరంకుశంగా నిర్మూలించటమే అవుతుందా? మత ప్రచారంవల్ల శాంతిభద్రతలకు భంగం కలుగకుండా వుండటాని కవసరమగు చర్యలు తీసుకోవటం మత స్వేచ్ఛను కుదించటంకాదు గదా? మత స్వాతంత్ర్యం పేరుతో అన్యమతస్థుల దేవాలయాలనూ, పవిత్ర స్థలాలనూ మైలపరచటానికిగానీ, వారి సమావేశాలను, సరస్సులనూ చెదరగొట్టటానికిగానీ ఏ వ్యక్తికైనా స్వేచ్ఛ కలదా? మతం పేరుతో నరబలులనూ, జంతుబలులనూ యివ్వటాన్నీ, దిగంబరులై ఊరేగింపులూ, ఉత్సవాలూ జరుపుకోటాన్నీ ఐహిక రాజ్యం సహించవచ్చునా? అలాగే మతం పేరుతో సతీ సహగమనాన్నీ, అంటరానితనాన్నీ, దేవదాసీవిధానాన్నీ సమర్థించి, ఆచరించటం ఐహికరాజ్యం అంగీకరించిన విధి నిషేధాలను ఉల్లంఘించటమేగదా?

ఐహికరాజ్యం ప్రసాదించే వ్యక్తిగత మతస్వాతంత్ర్యానికి కొన్ని న్యాయమైన హద్దులు వుండటం సహజమే, సమంజసమే. శాంతిభద్రతలు, నైతికవిలువలే గాక, ప్రజలు పరమపవిత్రంగా భావించే ప్రాథమిక హక్కులు కూడ యీ నిషేధాలను అంగీకరిస్తున్నాయి. మతం పేరుతో అంటరానితనాన్నీ, కులతత్వాన్నీ ఆచరించటం పౌరుల ప్రాథమిక హక్కులకు భంగకరం. ఒక మతానికి చెందిన వ్యక్తులు యితర మతస్థుల దేవాలయాల్లోనో, విద్యాలయాల్లోనో తమ మతాచారాలను జరుపుకోవటం వారి ప్రాథమిక స్వత్వాలను ఉల్లంఘించటమేనని కోర్టులు తీర్పులు యిచ్చివున్నాయి. అయితే వ్యక్తిగతమైన మత స్వాతంత్ర్యాన్ని గూర్చి ఆలోచించేటప్పుడు ఒక ప్రధానమైన ప్రశ్నకు ఐహికవాదులు సమాధానం చెప్పాలి. అదేమిటంటే ఐహికరాజ్యంలో మతం అంటే యేమిటో ఎవరు నిర్వచిస్తారు? (Who defines religion in a secular state?) ప్రభుత్వమా? మత సంస్థలా? వ్యక్తులా? ప్రభుత్వంగాని, మతసంస్థలుగాని మతాన్ని నిర్వచించి, నిర్ణయించటం జరిగితే వ్యక్తిగతమైన మత స్వేచ్ఛకు అర్థంలేదు. మతం అనేది వ్యక్తియొక్క అంతరాత్మకూ, అతని నైతికసంస్కారానికీ సంబంధించిన విషయం కనుక ప్రతివ్యక్తి తన మతం ఎలాంటిదో తానే నిర్ణయించుకోవాలి. ఈ సందర్భంలో బొంబాయి హైకోర్టు వెలిబుచ్చిన యీ క్రింది అభిప్రాయంతో ఐహిక వాదులు ఏకీభవిస్తారు.

"Whatever binds a man to his own conscience and whatever moral and ethical principles regulate the lives of men, that alone can constitute religion... ."

ఐహికవాదులందరూ అంగీకరించిన శాంతిభద్రతలు, నైతికసూత్రాలు, ప్రాథమికహక్కులు యిత్యాది ప్రధానమైన హద్దులేగాక, భారత రాజ్యాంగం వ్యక్తిగతమైన మత స్వాతంత్ర్యంపై మరికొన్ని యితర ఆంక్షలనుకూడ విధించింది. దేవాలయాల పరిపాలనను పర్యవేక్షించటానికి, హైందవ సంఘంలో సంస్కరణలు ప్రవేశపెట్టటానికీ రాజ్యాంగం ప్రభుత్వానికి అధికారం యిచ్చింది. ఈ అధికారాలను పురస్కరించుకొనే ప్రభుత్వాలు హైందవ మతాదాయ చట్టాలు (Hindu religious endowment acts), హైందవ వివాహాది చట్టాలు చేశాయి.

ఐహికరాజ్యంలో వ్యక్తులకేగాదు, మత సంస్థలకు కూడ స్వాతంత్ర్యం వుంటుంది. పౌరులు మత విషయాల్లో సమాలోచనలు జరుపుకొని సమాజాలూ, సంస్థలూ ఏర్పాటుచేసుకోవచ్చు. వాటిద్వారా తమ మతాన్ని ప్రచారం చేసుకోవచ్చు. ధర్మకార్యాలను చేపట్టవచ్చు. అవసరమైన స్థిరచరాస్తులను సంపాదించుకొనవచ్చును. అలా సంపాదించిన ఆస్తిపాస్తులను శాసనాలకు లోబడి అభివృద్ధి చేసుకొవచ్చును. ఐహిక రాజ్యంలో అల్పసంఖ్యాకవర్గాలు—అవి ఏ మతానికీ ఏ భాషకూ చెందినా—తమ వికాసానికవసరమైన విద్యాసంస్థలను నిరభ్యంతరంగా ఏర్పాటు చేసుకోవచ్చును. భాషామతాల ప్రాతిపదికపై ఎటువంటి విచక్షత చూపకుండా ప్రభుత్వం అన్ని విద్యాసంస్థలకూ ఆర్థికసహాయం చేయక తప్పదు. అయితే ఐహిక రాజ్యంలో మత సంస్థలు అనుభవించే స్వేచ్ఛకుగూడ హద్దు లున్నాయి. సంఘక్షేమానికీ, శాంతిభద్రతలకూ, నైతికవిలువలకూ, ప్రాథమిక హక్కులకూ భంగకరమైన కార్యకలాపాలను ఐహికరాజ్యం అంగీకరించదు.

## 2. సమాన పౌరసత్వం

సమాన పౌరసత్వం ఐహిక రాజ్యంయొక్క ద్వితీయ ప్రధాన లక్షణం. ఐహికరాజ్యం ప్రతివ్యక్తికీ సమానమైన హక్కులనూ, అవకాశాలనూ కలిగిస్తుంది. ఆ వ్యక్తియొక్క మత విశ్వాసాలతో ఐహిక రాజ్యానికి ప్రమేయంలేదు. రాజ్యాంగం ప్రసాదించిన హక్కులన్నీ ప్రతి పౌరుడూ—అతడు ఏ మతానికి చెందినా—అనుభవించగలడు. పౌరధర్మాల నిర్వహణకు వ్యక్తిగత విశ్వాసాలు అడ్డురావు. జాతి, మత, కుల ప్రాతిపదికలపై పౌరులమధ్య ఎటువంటి విచక్షతనూ ప్రభుత్వం చూపించదు. ఉద్యోగాల విషయాల్లో పౌరులందరకూ సమానమైన అవకాశాలు కల్పించబడతాయి. ప్రభుత్వ సహాయాన్ని పొంది నడువబడుతూవున్న యే విద్యాసంస్థయైనా మత ప్రాతిపదికపై విద్యార్థులను చేర్చుకోరాదు. ఇక ఎన్నికల విషయంలో కూడ జాతి, మత, కుల ప్రాధాన్యం వుండటానికి వీలులేదు. వోటర్లుగా నమోదు కావటానికి, అభ్యర్థులుగా

పోటీ చేయుటానికీ, జాతి మత కులాలు అడ్డు రాకూడదు. ఒక్కమాటలో చెప్పాలంటే ఐహిక రాజ్యంలో పౌరసత్వానికి వ్యక్తియే పునాది. అంతేగాని మతంగాని, కులంగాని కావు. ఈ విషయాన్నిగురించి డోనాల్డ్ యూజీన్‌స్మిత్ వ్రాసిన మాటలు యివి:—

"The second component of the secular state, the concept of citizenship is based on the idea that the individual, not the group is the basic unit."

### 3. రాజ్యవ్యవస్థకూ మత సంస్థలకూ మధ్య సంబంధ రాహిత్యం

మత స్వాతంత్ర్యం, సమాన పౌరసత్వాలతో పాటు ఐహిక సమాజంలో రాజ్యవ్యవస్థకూ మత సంస్థలకూ మధ్య ఎటువంటి అనుబంధమూ వుండకూడదని కొందరు భావిస్తున్నారు. ఎందుకంటే మత సంస్థలు ఆధ్యాత్మిక జగత్తుకు సంబంధించినవి, రాజ్యవ్యవస్థ లౌకిక జగత్తుకు సంబంధించినది. పౌరులకూ—ప్రభుత్వానికీ మధ్య వుండవలసిన సంబంధం లౌకికమైనదేగాని మత సంబంధమైనది కాదుగదా? అందువల్ల ప్రభుత్వ నిర్మాణంలోకాని, విధానాల్లోగాని యేదో ఒక మత దృక్పథం చోటు చేసుకోటానికి వీలులేదు. వాస్తవానికి రాజ్యవ్యవస్థ పరిధి వేరు. మతం పరిధి వేరు. ఏదో ఒక మతాన్ని స్థాపించి, వ్యాప్తి చేయవలసిన అవసరం ప్రభుత్వానికి లేదు. తమ ప్రయోజనాలకై ప్రభుత్వం ఏర్పాటు చేయవలసిన అధికారం మత సంస్థలకు వుండకూడదు. రాజ్యవ్యవస్థ—మతం ఒకదాని కొకటి దూరంగా వుండకపోయినచో మత స్వాతంత్ర్యం, సమాన పౌరసత్వం దెబ్బతింటాయి. ప్రభుత్వమే మత దృష్టితో నడుస్తూవుంటే సర్వమత సామరస్యం, అందరికూ సమాన అవకాశాలూ ఎలా సిద్ధిస్తాయి? అందువల్ల కవూర్ అను ఇటలీ రాజకీయవేత్త ఐహిక సమాజం అనగా స్వేచ్ఛాయుత రాజ్యంలో స్వేచ్ఛాపూరిత మత సంస్థలు (A free church in a free state) సహజీవనాన్ని కలిగివుండుటయే నన్నాడు. కాగా ఐహిక రాజ్యంలో ప్రభుత్వం అధికారభాషవలె అధికారమతాన్ని అంగీకరించదు. అధికసంఖ్యాకులు అనుసరించే మతానికి గూడ ఎటువంటి ప్రత్యేకమైన స్థానం యివ్వబడదు. ఏ ఒక్కమతాన్ని అభివృద్ధిచేయుటానికై ప్రభుత్వం ప్రత్యేకమైన పన్నులు వసూలు చెయ్యదు. పైగా ప్రభుత్వ నిధులతో నడుపబడే విద్యాలయాల్లో మత బోధ జరుగదు. పైన వివరించిన విషయాలనుబట్టి తేలిన సారాంశం యిది:—

1. ఐహికరాజ్యంలో వ్యక్తులకు, సంస్థలకు మత స్వాతంత్ర్యం వుంటుంది. 2. ఐహికరాజ్యం మతప్రసక్తి లేకుండా పౌరు లెల్లరకూ సమానమైన హక్కులనూ, అవకాశాలనూ కలిగిస్తుంది. 3. ఐహిక రాజ్యంలో అధికార మతమంటూ ఏదీ వుండదు. అది యే వొక్క మతంయొక్క అభివృద్ధికీ ప్రత్యేకంగా కృషి చెయ్యదు. ఐహికరాజ్యంలో మతానికీ, వ్యక్తికీ మధ్య, రాజ్యవ్యవస్థకూ వ్యక్తికీమధ్య, రాజ్యవ్యవస్థకూ మత సంస్థలకూ మధ్య సంబంధాలు వ్యక్తిస్వేచ్ఛకు అవరోధం లేని పద్ధతిలో అమర్చబడి వుంటాయి. డోనాల్డ్ యూజీన్‌స్మిత్ ఐహికరాజ్య స్వరూపాన్ని వివరిస్తూ వెలిబుచ్చిన అభిప్రాయాలు గమనార్హాలు:—

"The secular state is a state which guarantees individual and corporate freedom of religion, deals with the individual as a citizen irrespective of his religion, is not constitutionally connected to a particular religion nor does it seek either to promote or interfere with religion. Upon closer examination it will be seen that the conception of a secular state involves three distinct but inter related sets of relation ships concerning the State, religion and the individual. The three sets of relations are:—

1. Religion and the individual (Freedom of Religion.)
2. The state and the individual (citizen ship.)
3. The state and religion (separation of state and religion.)

[See "India as a secular state" by Smith.]

'మతాన్ని మత్తు మందుగా, ఈశ్వరోపాసనను దురాచారంగా జమకట్టి, వాటి స్థానంలో నాస్తికత్వాన్ని బలవంతంగా ప్రవేశపెట్టటమే' ఐహికత్వం యొక్క లక్ష్యం కాదా? అనే అనుమానం కొందరికి వుండవచ్చు. ఈ అనుమానాంశం ఆధారరహితం.

ఐహికత్వం నాస్తికత్వం కాదు. మతంమీద పగ అంత కంటె కాదు. ఎందుకంటే శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించినచో, ఐహికత్వం పరిధి వేరు, మతతత్వం పరిధి వేరు అని తేలుతుంది. మతతత్వం అగోచరమైన ఆధ్యాత్మిక జగత్తును విశదీకరించటానికి యత్నిస్తుంది. ఐహికత్వానికి అగోచరజగత్తుతో నిమిత్తం లేదు. అది పంచేంద్రియ గోచరమైన భౌతిక ప్రపంచాన్ని వివరిస్తుంది. గత జన్మను గురించిగానీ, రాబోయే జన్మను గురించిగానీ ఐహికవాదులు పరిశోధించరు. అనుభవానికి అందనటువంటి ఆస్తికత్వం, నాస్తికత్వంవంటి నిగూఢమైన విషయాలను గురించి ఐహికత్వం పట్టించుకోదు. ఎరిక్ వాటర్ హౌస్ మహాశయుడు యీ విషయాన్ని యిలా వివరిస్తున్నాడు:-

"The relations of secularism to religion are defined as mutually exclusive rather than hostile .......Neither theism nor atheism enters into the secularist theme, bacause neither is provable by experience." (See Secularism in Encylopaedia of Religion and Ethics )

ఐహికత్వం మతతత్వానికంటె భిన్నమైనా, మానవత్వాన్ని కాదనలేదు. అందుచేత సహనశీలురైన మతవాదుల్లో కనబడే మానవతా విలువలను ఐహికత్వం నిరసించదు. వారిలో వున్న ఆరాధనాభావాన్ని, జీవకారుణ్యాన్ని, విశ్వమానవప్రేమనూ ఐహికవాదులు కాదనలేరు. వ్యష్టిగాగానీ, సమష్టిగాగానీ మానవులందరూ జరుపుకొనే ఆధ్యాత్మికచింతనమూ, ఆరాధనమూ ఐహికవాదులు త్రోసిరాజనరు. ఒకవేళ యెవరైనా ఐహికత్వం నాస్తికత్వం ఒకటేనని భావిస్తే, వారు ఐహికత్వాన్ని ఒక మూఢమైన ఉద్రేకంగా మారుస్తున్నారని చెప్పక తప్పదు.

ఈ వ్యాసంలో చర్చించిన విషయా లనుబట్టి ఒక స్పష్టమైన తీర్మానం చేసుకోవచ్చు. అదేమనగా:— ఐహికత్వం మతోన్మాదానికి బద్ధశత్రువు. మతోన్మాదం మానవుల స్వాతంత్ర్యాన్నీ, సత్యాన్వేషణమూ తిరస్కరిస్తుంది. సంఘర్షణంకూ, అశాంతికీ దారి తీస్తుంది. ఈనాడు ప్రపంచ మానవు లందరూ స్వేచ్ఛనూ, శాంతిని వాంఛిస్తున్నారు. శాస్త్ర విజ్ఞానం వసుధైక కుటుంబ నిర్మాణాని కవసరమైన సాధన సదుపాయాలను సమకూరుస్తుంది. ఈ పరిస్థితుల్లో నిమూఢ విధ్వంసక మతోన్మాదాన్ని పరిత్యజించి, స్వేచ్ఛాపూరిత ఐహికత్వాన్ని వరించుటే మేలు.






# మూడునాళ్ళాయెరా మువ్వగోపాలా!

శ్రీ జి. నరసింహారావు

రంగసాని వేణుగోపాలస్వామి ఆలయంలో ఆ రాత్రి తొలిసారిగా గజ్జె కడుతుందని ఊరంతా హోరెత్తి పోతూంది—వరదనాటి ఏరులా. వయసు విరిసీవిరియని వేడుకలో, మా పడుచుగుండెల కీ మాట వంశీగీతమే అయింది కదా! ఆ ఎలనాగ: పదునారు వసంతాల అందాలు యీ రాత్రి కోవెల మంటపంలో: చిందులు వేస్తాయి. సిరుల సంపెంగల పరిమళాల బరువులతో మా ఎదలు బరువెక్కిపోతాయి అనే సంబరంలో పడుచుకులమంతా మహాముచ్చట పడిపోతున్నారు. ఈ రాత్రి మా ఊరి గోపాలుని జీవితంలో మరెన్నో మధురాల రాత్రుల కథలను జ్ఞాపకానికి తెస్తుంది కాబోలు. సరసగోపబాలుడు: రాగవతి హృదయాన్ని చేకొనునో లేదో!

మబ్బులు లేకపోయినా ఆనందం: అందం వర్షిస్తున్నా యీ రాత్రి మా ఊళ్ళో. ఆ ఒయ్యారి లావణ్య విలాసాన్ని తిలకించడానికే కాబోలు: రసికులకన్న ముందు రేరా జొచ్చేసాడు: వెన్నెల వెలుతురు విందుచేస్తూ!

తిరునాళ్ల రోజులా ఉంది. కోవెల అంతా కోడె వయసుగాళ్ల నూనూగు మీసాల మీదే మెరిసే. చిర్నవ్వులతోను, ముసలి రసికుల ముగిసిన ముచ్చట్లతోను, వెన్నెలంతా సందడిగానూ ఉంది. రంగసానితల్లి పద్మసాని కోవెలంతా తానై తిరుగుతూ: తోటి సానులకు ఆజ్ఞల జారీచేస్తూ, వయసుడిగన వెన్నెలరాయుల మనసుల్లో మధుర స్మృతులను కలచివేస్తూ: కన్నుల్లో చిలికిచిలకని నవ్వుతో సంవత్సరాల క్రిందటి అనుభవాల్ని పలుకరిస్తూ మహాసందడి చేస్తూంది.

వయసుగాళ్లు: ఏదో వంకపెట్టుకొని కోవెల మంటపంలో ఉదయంనుంచి కాపుర మున్నవారు: వెన్నెలను వేగం రమ్మని: వెన్నెల బాలను వేవేగం రమ్మని: మలయపవనంద్వారా: కంటి చూపులద్వారా కబుర్లు పంపగా: పంపగా: ఆశలు ఫలించినాయి మరి. అయినా వేణుగోపాలుడు మాత్రము తక్కువ తిన్నవాడా! రసిక తెరుగనివాడా! మాలో నిండి, తను తృప్తిపడతాడుకాని: కన్నెను పొల్లు పోనీయునా! బృందావనంలోని మధుర వసంతాలను: రాధమ్మ హృదయాన్ని మరచిపోతాడా? యమునాతటంలో చీకటి గానుగచెట్ల నీడలో నిరంతరం సాగిన ఆ కేళీవిలాసాలు: స్వామి హృదయంలో చెరగి పోతాయా! ··· రాత్రుల రాగాలు ఆయనవి కావా!....ఆయన కన్నియల సొమ్ము కాదా! .. మధురానుభూతులను మనకు దానంచేసిన స్వామి: మంచిగంధపు పరిమళంలాంటి రంగసాని యౌవనాన్ని రాగార్పితం చేయకుండా వదలడమే! రేయి వెన్నెలలు: పూలబాలలు: వేణుగీతాలు: కలల లోకాలు చిన్నపుచ్చుకోవా!...మందపాలు; బృందావనాలు:

తను తలుచుకుంటే కావా!....రంగసాని రాగం రాగించదా!·· వయసు వెన్నెలలు: వలపు కన్నియలు: ఆరేయి: విచ్చుకొన్న హృదయంలోని ప్రణయభావాలతో నీరాజనా లర్పించవా కొంటె గోపబాలునికి.

అందియలు ఘల్లుమన్నాయి. గుండెలు ఝుల్లుమన్నాయి. స్వామిముందు రంగసాని 'మూడునాళ్లాయెరా, మువ్వగోపాలా' అభినయిస్తూంటే: వెన్నెలను ఉట్టినే పోనివ్వని చిన్నవాళ్ల గుండెల్లో కెందామరలు తామరతంపరగా విరిసి మురిసినవి. అమలమోహనంగా: ఆ సుందరి: ఆ గీతాన్ని: అభినయిస్తూంటే :వయసుగుండెలు: వసంతోత్సవాలనాటి రాయలరంగరంగ వైభవాన్ని: తలపుకు తెచ్చుకున్నాయి...చిలిపితనాల గోపబాలుడు యీ రేయి పవిత్రమైన యీ విరిబాల రాగవిన్యాసంతో: రసిక తనిపించుకుంటున్నాడు. రాధమ్మ రాగాలనాటి మాటలు కథలే అయినా: యీనాటి రంగసానీ అర్పితురైన గోపాలదేవుని రసికత: మధురాల కథే కాక మరచిపోలేని నిజం అనిపించుతుంది.

అందరిలోనూ మువ్వ గోపాలమూర్తి నిలచి రంగసాని నాట్యవిన్యాసంలోని నాణ్యతను: తమిదీర మా కందించి వేస్తున్నాడు. ఆనందాతిరేకయై: ఆవేశంతో, అనురాగంతో, అనుతాపంతో అంతర్లీనమైన ఆధ్యాత్మిక తత్వంతో అనన్యసామాన్యంగా ఆ లాయ్యలి: గుండెలు అందియలై: యుగాలక్రిందట బృందావన సుందరతరసీమల్లో పలికినంత మోహనంగా మంజులంగా ఘల్లుమంటూంటే రసస్పందనతో రాగిల్లని హృదయా లెన్నని? కన్నుల్లో వెన్నెల వెలుగులు నింపుకుకూర్చున్న కొడెకారుపిల్లగాళ్ళు మల్లెలు మొల్లలై: ఆ మనోరంజని కబరీభరాశ్లేషాన్నయినా చాలని ఆశపడలేదనా !

అనితరమైన ముగ్ధమనోహర రూపలావణ్యశేకి విలాసాలతో: వేణుగోపాలుని చెంత ఆ మోహని: ఆడింది, పాడింది. అంగికంలో: వాచికంలో: తనకు తనే సాటి అనిపించుకుంది. వెరచింతనలేని వలపుపిల్లగాళ్ళ హృదయాల్ని నెమళ్ళనుచేసి ఆడించింది: కోయిలలనుచేసి పాడించింది. తన వాల్చూపు బరువుకే వారి గుండెలు బరువైనాయి. తన చిర్నవ్వు ందుకే వారి మనస్సులు పున్నమలైనాయి...పువ్వుల దారుల ఆ పైడివలపుబాలను ప్రణయయాత్ర చేయించాలని రసికుల హృదయాలు అభిలాషించినయంటే: నెలబాల నాట్యమెంతటి పోడిమల పోయిందో మరి !

ఆ ఎలనాగ వంశంవారు చేసుకున్న అదృష్టానికి రంగాజమ్మే తిరిగి జన్మించిందన్నారు పండితులు. ఊరి కోవెలదీ: కోవెల గోపాలునిదీ అదృష్టమన్నారు కొందరు. రసికత మరచిపోతున్న రోజుల్లో పునరుద్ధరించడానికి: మారుడు పంపిన మరోబాణం అన్నారు రసికులు. ఏది ఎట్లాగయినా మా కింక పున్నమలు బరువయిపోతాయి...సెలయేటి గలగలలు: చిర్నవ్వు మిలమిలలు: మనస్సుల్ని: మంచిగంధపు విషంతో ప్రాణం తీసేటట్లు చేస్తాయి.

పెద్దలు కొందరు: 'వృత్తిలోకి దీనిని దింపకుమా' అన్నారు పద్మసానితో. 'స్వామీ! అందం వయసుది. ఆనందం మనసుది. మనసు మువ్వగోపాలుని సొమ్ము. వయసు తమలోటి వలపుగాళ్ళ సొమ్ము. రసికుడు వాకిట నిలచి వలపు భిక్ష పెట్టమంటే, కాదనడం కుల ధర్మమా? హృదయాన్ని స్వామి కంకితం చేయగా మిగిలిన శరీరం ఏమయితేనేమి? కోరిన మా రాజుల ముచ్చట తీర్చలేనిమే మెందుకు? అందక అందముంటే అలరింపేమిటి? వయసులోని వెన్నెలలను చిన్నబుచ్చమంటారా? వలపుల వీవన హృదయానికి దీవెన. బ్రతుకు రసభరితంకదా! ప్రభువులకు తెలియనిదేముంది. వయస్సులోని అనుభవం: వలపుకి నీరాజనం అన్నారు పూర్వులు. అలరింపులేని అడదాన్ని స్వామి మాత్రం సరస హృదయంతో సరసన చేర్చుకోగలడా? ఏ వయసు కా ముచ్చట. పువ్వులు అందం

కోసం; పరిమళం ఆనందంకోసం. అందం మనది: ఆనందం స్వామిది. అందాన్ని అనుభవించడంద్వారా, ఆనందాన్ని స్వామికి అర్పితం చేస్తామని పెద్దలు చెప్పలేదా? అందానికి ఆమడదూరంలో నిలబడితే ఆనందం లభిస్తుందా? అనురాగంతో ఆర్ద్రమవని హృదయానికి స్వామి సేవ లక్ష్యమౌనా?...తమరు చెప్పిన మాటలే: మరచిపోయరా మా రాజులు...నియోగించబడ్డ ధర్మాన్ని కాలదన్నడం న్యాయమా? సెలవియ్యండి. స్వామి అనలేక ఏమీ చెయ్యము మా కులమువారము. ఈ దినమే అన అయినది..స్వామి కారగింపుగాఉంచబడ్డ నైవేద్యాన్ని: భక్తులు భుజించడం లేదా?...తప్పు ఒప్పులు ఎన్నుతున్నామా?..అందం అందరి సొమ్ము. ఆనందంమాత్రం ఆయన సొమ్ము. అనుభవిస్తున్నది మనలోని మువ్వ గోపాలమూర్తి... ఏమీ తెలియని పేదలుకారుకదా, ప్రభువులు: పద్మసాని నెందుకు కదిపినారో?...అయినా వయసు చివరి ముచ్చట, మురిపెమూ యిదియే కాబోలు' అంటూ పద్మసాని పెద్దల మాటలతో పెద్దంపే సమాధానపరచేసరికల్లా సభ ముగిసింది.

'నువ్వు బ్రతకనేర్చినదానివి. వయసులో వెన్నెలవే: నీముందుకు పిలిపించుకున్న నెరజాణవు. మా మనసుల మరులు నింపి, నీ యింటి మూడు చుట్లూ తిప్పితిప్పి, మల్లెపువ్వుల, మంచి గంధపుసేవ చేయించుకొన్న మచ్చకంటివి. నువ్వు వయసులోని అందాన్ని అందలమెక్కించి, ఆనందాన్ని అరువులేని వ్యాపారంగా చలామణీ చేయించక వదుల్తావా' అనుకుని వెళ్లిపోయినవాళ్ళను చూసి: 'వయసులో, మా రాజుల యీ మాటలు ఏమాయెనో కదా! వెన్నెలనుంచి వేకువవరకూ వీధి గుమ్మంలో వేచియుండే యీ రసికులు యివాళ అస్త్రసన్యాసంచేసి: ముదిమి ముచ్చటలు చెప్పుతున్నారు. వరువంతో పంట పండించకపోతే, రేపటి మాటేమిటి. మనసుకోసం గోపాలుడు, మనిషికోసం యీ మహరాజులు...అందానికి, ఆనందానికి ఉన్న లంకె అర్థం చేసుకోలేని పెద్దలు..' అనుకుంటూ నవ్వుకుంది పద్మసాని,

మధురస్మృతులు హృదయాలను కలచి వేస్తూంటే: వయసు గుండెలకు, వెన్నెలరాజుకు తనుమూత లేదు...

కొమ్మకు కన్నెరికం పెట్టగల పెద్ద మనిషికోసం ప్రయత్నించకుండా ఉంటుందా పద్మసాని? సర్వప్రయత్నాలు చేస్తూంది. ఎవరెవరి కన్ను ఏ పోకడలో వెలుగుతున్నది పసికట్టి ఉసికొల్పించగల నేర్పరి పద్మసాని. పడుచువాళ్ళనుంచి పెద్దమనుషులవరకు ఎవరెవరి ఫాయా లెంతెంతవో, ఎవరెవరి మనసు లే లెక్కమీద మసులుతున్నవో అంచనాలు పరిచూసి, వలలు వేసింది. చివరికి సై అంది ఓ జమీందారు గారి చిన్నవాడికి. ఎంతైనా పెద్దింటి పరువు నీడన బ్రతుకుకదా! ఫలానా జమీందారు చినవాడి చిన్నది అంటే ఎంతగిరాకీ, ఎంత పలుకుబడి!... పెరటిత్రోవ పద్దులు హద్దులు దాటునుకదా! వాదవాదంతా తన మేడ కప్పు లెంత వెలుగు...ముందు చూపులో, బేరం పది తక్కువే అయినా ఒప్పుకుంది. ముహూర్త నిర్ణయం చేయించి, మనసుపడ్డ మగవానికి: వెన్నెలతో రమ్మని కబురంపింది.

కాని సిరిగల చిన్నదానికి సంగతి ఏమాత్రమూ తెలియదు. 'వయసులోని వలపు, మనసులోని మమత : ఆ స్వామివి. వేణువును నేను...ఆ స్వామి సొమ్మును...ఆయన పెదాల తాకగానే పులకరించి పాడతాను...యమున హృదయాన్ని నేను...ఆయన పాటకు పరవశ్యాత్తి తరగల నాట్యాలతో తన్మయ నవుతాను. రాధమ్మను నేను....రాగవివశనై లేలహృదయంతో ఆ వేణుగోపబాలుని కాలి అందియ సుతారపురాగప్రస్తారానికయినా అవశనై, అవ్యక్తమైన అనురాగాన్నిగా మారి: ముద్దుల ముగిసిపోతాను...నే నింకెవరికి ఏమీ కాను... జీవితమంతా ఆ దేవదేవునిదాసిగా బ్రతికి, ఆయనలోనే అస్తమిస్తాను. స్వామి రాగాల రూపందుకున్న జీవితం నాది...అందుకే అది ఆయనది' ఇది పిల్లదాని మనసు...తల్లీ పిల్లల తలపులు సమాంతరపథాల్లో పయనిస్తున్నాయి...

సమయం చూసి, తల్లి పిల్లనుచేర: లాలించి, బుజ్జగించి మాటలు మనసు కలిపి: గత కాలపు కథలను గడుసుగాచెప్పి: అసలు విషయం బయటపెట్టి: జవాబుకోసం ఎదురుచూడకుండా వెళ్లిపోయింది. వయసుకి వేడెక్కించి వదిలేస్తే తరువాత పని మారుడు చూసుకుంటాడని జాణ పద్మసాని ఎరుగదా?...అయినా సమాధానం కోరే సమయం కాదది..అమాయిక అయిన కూతురు కాదంటుందా? వాదు లాడుతుందా?....

పిల్లదాని మనసున పిడుగులు వర్షించెను.. తన తలపేమి, తల్లి ఆలోచనేమి? కలనైన యీ తనువు అన్యనదని అనుకోలేదే తను. తల్లి ఎందుకిలా పెరచింతన చేసేను. వేశ్యగా జన్మించినందుకు, వృత్తిచేయుటంకన్నా అన్యము లేదా బ్రతుకునకు? తను మాత్రం స్త్రీ కాదా?.. హృదయం లేదా?..మరి అన్యస్త్రీలవోలె తను మనసుపడ్డ మగవానికే తన్ను తా నర్పించు కొనుట న్యాయము కాదా? మూడునాళ్ళ ముచ్చ టైన యీ తనువును పరులకు బందీచేయుటా?... తన దేవుడు గోపాలుడు మిన్నకుండునా? మలిన మైన శరీరముతో: తన దేవుని పూజించగలదా తను? రోజావలె రాగము రాగిల్లేలా, రక్తిమ మ్మలరాలా: తను గజ్జెకట్టి ఆడగలదా, పాడ గలదా? గజ్జెలు పలుకునా? మలినమైన మనసు లోనికి మధురభావన చొరగలదా? మనసు ముంగిట నిలచి పిలచే గోపబాలుడు ఎక్కడా? వయసు వాకిట వేచి పిలచే వయసుగాడు మిన్నా! దేవదేవునికి అంకితంచెయ్యబడ్డ యీ రంగసాని: యింకో సరసునిముందు...అన్యముగ వర్తింప గలదా?...సరసులకెల్ల సరసుడైన రాధా మాధ వునికన్న సరసులా వీరు. మరి యీ మనుగడ లెందుకు?...అమ్మమాట కాదనుటా?..గోపాలుని చిన్నబుచ్చుటా..మనసుపడ్డ చిన్నది అన్యుల హక్కయిపోయిన: ఆర్తిచెందడా? తన స్వామి?.. కర్పూర నీరాజనంతో స్వామి నర్చించగల భాగ్యము యీ బ్రతుకుకు వదులుకొనుటా?... నిజమైన దేవదాసిగా యీ జీవితమును పునీతము చేసుకొనుటా?..నిన్నా మొన్నటి బాల్యమందు లేని బరువు, బాధ్యత నేటి యౌవనమ్మునం దేల యుండవలె?...నిన్నటివరకూ స్వామి సొత్తయిన తను: నేడు అన్యము కావలెనా?.. చిరంతనమైన అనురాగ శ్రీ విరాజితమౌ స్వామి పాదసన్నిధి పూమాలవోలె సోలిపడియుండుట కన్నా భాగ్యము గలదా బ్రతుకునకు?'..చిన్నది సదసత్సంశయముతో ఎటూ తేల్చుకోలేక, తెగించి, తను నమ్ముకొన్నవాడు, తనను కొల్ల గొన్నవాడు అయిన గొల్లదేవునే అడగడానికి చిన్నది హంసగమనయై కదిలె.

స్వామి రోజూలా వెన్నెలంత చల్లంగానూ నవ్వుతూంటే చిన్నది చిరుకోపముతో 'మనసు లేని స్వామి! మగువ బాధ తెలియవా? మంచీ చెడుల మధ్య నీ మనసుకత్తె నలిగిపోతూంటే నీకేమీ పట్టనట్లు నవ్వుతావుగా! రేపు రాగహీన యైన యీ రంగసాని నీ ముందు గొంతెత్త గలదా? నీ హృదయం ఆనందంతో అవశ యయ్యేటట్లు ఆడగలదా? అప్పుడు నీకు ఆలనా, పాలనా ఏది? సుమకోమలి పూజలు వెగటాయె కదా స్వామీ! అవునులే. నీవు మాత్రము మగ వాడివి కావా! రాధమ్మ అమాయిక కనుక కినుక పూనక ఊరకుందిగాని, గోపాలా, నే నూరుకోను..నేను వెన్నెల సెలయేరును... నీ పవిత్రపాదస్థలి ప్రవహించ పుణ్యనవుతాను.. నా బ్రతుకు చీకటి వెలుగుల మధ్య ఊగిస లాడుతూంది. నువ్వుతప్ప అన్యము శరణ్యము కాదు. ఏమందువు? నిన్ను ఒల్లకుండ, వయ సుని అమ్ముకుని బ్రతుకెల్ల బరువుగా చీకటి గుయ్యారాల్లోకి చెరిగి పొమ్మందువా? నీదానిగా చివరి ఊపిరి పిలుచువరకూ, పలుకువరకూ, నీ పాట పాడుతూ, నీ ముంగిట ఆడుతూ నిలచి పొమ్మందువా? వయసు ముఖ్యమా, మనసు ముఖ్యమా సామి? వయసు పోవునుగాని మనసు పోదుకదా!...నీ వెంట వెలిగే జ్యోతిగా మనసు మనునుకదా!...పోయే వయసుకన్నా పోని మనసుపై మమత పెంచుకొనుట మంచిదికదా! నీ చెంత ఆడుటకన్న ఆడదైనందులకి బ్రతు కున కింకేమి కావలయును స్వామీ! మనసుకి

మగవాడివి నీవు...మా ఆశ నీది. నీ తృప్తి మాది...నీకోసము గొంతు విప్పగలుగు పేౖబతుకుకి భాగ్యము..నీ ముంగిట నిలచి: నిత్యమంగళ మోహనమూర్తివైన నిన్ను కొలిచి: జీవితమంతయు సుమపరీమళావృతము చేసుకొనుటా?.. వెన్నెల వేళల : విన్నబోవు హృదయమ్ముతో: నిత్యం ఆత్మవంచన చేసుకుంటూ : ఆ వయసుగాళ్ళ వలపు వానల జరువుతో క్రుంగిపోవుటా?... ఏమి నీ యానస్వామీ? నీకూ, నాకూ యిదే ఆఖరి సమాగమం. వేశ్యావృత్తి యే శరణ్య మన్న: స్వామీ: నీ యానబొదల దాల్తును. కాని రంగసాని మరి నీ ముంగిట, నీకోసం ఆడలేదు, పాడలేదు .రాధమ్మ మనసు రంగసాని స్వామీ?.. మరి నిన్ను మలినమై చేరలేదు..నిర్జీవముగా నిష్క్రమించగలదు..ఈ పూలసెజ్జ దేవుని పూజా మందిర ముందుంచమందువా?..రసికుల శయ్యా మందిరముందుంచమందువా?..'దేవుడు మాటాడ లేదు...రాతి బొమ్మ మాటాడుట కంటిమా, వింటిమా?...అమాయిక, ముగ్ధకాన్తన ఆబేల అటుల ప్రశ్నించినది కాని...

కాని బాల మిన్నకుండునా!

'మాటాడవేమి స్వామీ! కలలలో కమ్మగా పలుకరించి, మనసును కొల్లగొన్ననాడేమాయె యీ మౌనము?.. ఏమీ ఎరుగని విరుతప్రాయ మున వలపుల దోచుకొని: యీనాడు మౌన మూనుట న్యాయమా!!..నువ్వు మాట్లాడునంత వరకూ, నేను మాట్లాడక: ఆటాడక, నీ ముంగిట కూర్చుందును. నే సమాయికమేకాను, మనసుతో మాట్లాడి. మానినిని సేద తీర్చుము. లేకపోయినా స్వామి. రంగసానిమాట దక్కనీయదు. పొగడల పొన్నల మాల లుంతవు. కస్తూరి కార్చన యుండదు. శ్రీ చందనస్నాన ముండదు. అలం కార ముండదు. అందముండదు..ఏముందువో మరి..అంతవరకూ నీ సన్నిధినే నిలచి: నిన్నే ధ్యానించుచూ కాలము పుత్తును..'అంటూ ఆశ మీద ఆశగల ఆ భోగము చిన్నది గుడి తలు పులు బిగించి కూర్చున్నది.

వెన్నెలాయెను..ఇంట చిన్నది లేదు..తల్లి ఊరంతా గాలించి: గుండెలవిసేలా ఏడ్చుచున్నది.

వేకువాయెను...గుడి తలుపులు తెరవబడ లేదు..పూజారి భయపడి పెద్దలకు కబురంపి నాడు...సంగతి తెలిసిన పద్మసాని అర్థము చేసు కొన్నది...

తలుపులు బద్దలుకొట్టి లోన చూడగనే మనసులేని మనిషున్నది: తొలిసారి గజ్జెకట్టిన నాటి రాత్రి నోయగమున్నది...కాని రాగాంచిత మైన హృదయము మాత్రము నిష్క్రమించి నది...మనసు మా రాజేమి చేసినాడో ఎవరి కెరుక?...వేణుగోపబాలుని వేణుగీతిలో యీ రంగసాని ఒక చిన్నితరగ అయినది కాబోలు!

నాటికి, నేటికి రంగసాని కథ కులము వారలకు ఊపిరి సలుపనీయదు...

రంగసాని పోయినా, వేణుగోపాలు డున్నాడు...

అందరమూ పోయినా, అతనుంటాడు...

అతని వేణువు పలుకుతూనే ఉంటుంది..

ఆ గుడి స్తంభాలు: అహరహమూ 'మూడు నాళ్లాయెరా మువ్వగోపాలా' అన్న ఆనాటి పాటను పాడుతూనే ఉంటాయి...

—

# ఎఱ్ఱన - మతసమన్వయము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

భారత కవిత్రయములో నన్నయ తిక్కనలకంటె, ఎఱ్ఱన కొక విశేషమున్నది. అది యాతని గురుస్తుతి. నన్నయ తిక్కనలు తమ్ముగూర్చి చెప్పుకొన్నప్పుడు గురుప్రస్తావన చేయలేదు—ఎఱ్ఱన అట్లుగాక తన గురువును, తన కృతులలో ఎంతో భక్తిపూర్వకముగా ప్రశంసించాడు.

"యామము రెన్మిదింట నియతాకృతిఁ
బ్రత్యహమున్ శివార్చనారామతయొప్ప
నిత్య శివరాత్రి వ్రతంబుగఁ బూని
భవ్యయోగామృత తృప్తిమైఁ
ద్రిజగ దర్పిత లీలఁ దనర్చు
శంకరస్వామి మునీంద్రు
భక్తజనవత్సలు
మద్గురు నాశ్రయించెదన్—
నృసి—పీఠి 11.

"కామవిలోభకల్పహల
గర్వపరంపర ఖండవాసి[1]
హృత్కామరసస్థితుండగు సదాశివుఁ గాంచి
తదేకవింశ చింతామణియై తలిర్పఁ
దుదిఁదాఁకిన యున్నతిఁగన్న
శంకరస్వామి గురుండు
మాతలఁపు పర్వము దానయియుండు గావుతన్
హరి. పూ. 1—10.

పై రెండు పద్యములనుబట్టి ఎఱ్ఱన గురువు శంకరస్వామియని స్పష్టమగుచున్నదికాని ప్రస్తుతము మనకు లభ్యములగుచున్న ఎఱ్ఱన కృతులలో నొకటియగు నారణ్యపర్వశేషమున నీ గురుస్తుతి లేదు. అందు "శివపదాబ్జ సంతత ధ్యాన సంసక్తచిత్తుఁడు"[2] అని మాత్రమే కలదు. దీనినిబట్టి అరణ్యపర్వశేష రచన నాటికి ఎఱ్ఱన యింకను నీ శంకరస్వామి సంయమీంద్రునికి శిష్యుడు కాలేదని నిస్సంశయముగ చెప్పవచ్చును. ఈ గురుప్రశంస లేని కారణముచేత, అరణ్యపర్వశేష రచన, ఎఱ్ఱన రచనలలో మొదటిదియని నిర్ణయము చేయుడము సరియైనదే.

నృసింహ పురాణమునుబట్టి చూడగా, ఎఱ్ఱన ఆరణ్యపర్వశేష రచనానంతరమే, శంకరస్వామి నాశ్రయించినట్లు తెలియుచున్నది.

ఆ గ్రంథమున, పై పద్యమునకు వెనుకనే యీ క్రింది వచనమున్నది—"అని యిట్లు క్రమంబునఁ బ్రధాన దేవతా సంకీర్తనంబును మహాకవిజనప్రార్థనంబును సద్గురుచరణానుస్మరణ సంకీర్తనంబును సమర్థించి" (పీఠి. 12) గురువు నాశ్రయించి, ఆతని కటాక్షముచేత తన కావ్య నిర్మాణశక్తి యితోధికమైనప్పుడు, గురుస్మరణ చేయుట సంభావ్యమే కదా! ఇంతేకాదు—ఇందే—

"గురుభజన పరాయణుఁడవు" (పీఠి. 19).

అని తన తాతచేత చెప్పించుటకూడ నృసింహపురాణ రచనాకాలము నాటికీ ఎఱ్ఱన శంకరస్వామి శిష్యుడయ్యెనని చెప్పవచ్చును.

ఇట్లు తన కృతులలో గురుప్రశంస చేయుటయేగాక అనన్య సామాన్యమగు తన గురుభక్తిని వెల్లడించుటకోయనునట్లుగా, ఆశ్వాసాంతగద్యలయందు గురుస్మరణమే మొదట గావించియున్నాడు—

---

1. "కామవిలోభ కల్పిత వికల్ప పరంపర ఖండవాసి" అని వ్రాతప్రతుల పాఠము.

2. అరణ్యపర్వము 7—469. ఈ పాదము గల "భవ్యచరిత్రుఁ డాపస్తంభ సూత్రుండు" అన్న పద్యము, "అచ్చు ప్రతులయందు మాత్రమే గన్పట్టుచున్నది" అని యుభోజ్ఞాపిక—వావిళ్ల ముద్రణ ప్రతి పుట 321.

"ఇది శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహధ్యానానంద సౌందర్యధుర్య శ్రీ సూర్య సుకవి సంభవ[3] శంభుదాస లక్షణాభిధేయ ఎఱ్ఱయ నామధేయ ప్రణీతంబైన......ప్రథమాశ్వాసము" ఈరీతిగా గద్య నృసింహపురాణ హరివంశములు రెండింటియందు గలదు.[4]

### శంకరస్వామి ఎవరు ?

ఎఱ్ఱన తన గురువును గూర్చి—అతడు 'మునీంద్రుడు' 'సంయమీశ్వరుడు' 'శివార్చనా । రతుడు' 'భక్తవత్సలుడు' అని చెప్పనేగాని మఱి తక్కిన వివరములేవియు నీయలేదు. ఈ విశేషణములనుబట్టి శంకరస్వామి మహాశివయోగియని మనకు స్పష్టమగుచున్నది. వాస్తవిక స్థితి యిట్లున్నను—వాఙ్మయ విమర్శకులును వారి ననుసరించి చరిత్రకారులును ఈ శంకర గురుని గూర్చి యెట్లు వ్రాసిరో పరిశీలింతము.

"శాంకరపీఠస్వాము లందరును భారతీ సంప్రదాయయతులు. అందుచే సరస్వతీదేవి నామములలో ఎఱ్ఱయకు భారతీ శబ్ద మభిమానము. బ్రహ్మదేవుని గూడ 'భారతికి గాదిలి' అని యతడు వర్ణించెను. అత డారణ్యపర్వము నారంభించిన కొద్దివ్యవధిలోనే సరస్వతీ గీత ఘట్టము వచ్చినది........

. . . . . . . . . . .

అంబ సవాంబుజోజ్జ్వలకరాంబుజ

---

శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి
ప్రకటస్ఫుటభాషణ రత్నరోచిరా
చుంబిత దిగ్విభాగ
శ్రుతిసూక్తి వివిక్త నిజ ప్రభావ
భావాంబరవీథివిశ్రుతవిహారి
నను గృపజూడు భారతీ'

అని వినుతించి కృతార్థుడయ్యెను. ......మఱియు నా భారతి యెట్టిది?

'పరవస్తు ప్రతిపత్తి ధుర్యమగు వైశ్వర్యంబు
పంచాశదక్షర సంసిద్ధ సమస్తశబ్దరచనా
సంవ్యాప్తి నుద్దీప్తమై
పరగం గల్పలతా సమృద్ధియగుచున్
బ్రజ్ఞావిశేషంబులన్
గరుణం బ్రోచు
పవిత్రి వాణి త్రిజగత్కల్యాణి బ్రార్థించెదన్'

ఈ భారతీదేవిని ఎఱ్ఱయ అపూర్వముగ భావించినాడు—శ్రీ లక్ష్మీనృసింహావతారములో

'కరకమలంబొసంగ బటికంబు కమండలువంటి
కాంతిభాసురమగు మౌక్తికంపు
జపమాత్రికముదాల్చుట బ్రహ్మవాదియై
పరగిన హంసమున్ బిలిచి
బాలమృణాళమంజుపు చందమై
సిరిం దిలకింపనొప్పు బుధసేవితమూర్తి
దలంతు భారతిన్'

భారతిని బ్రహ్మవాదియగు పరమహంస పరివ్రాజకాచార్యునిగా భావించుట శంకరస్వామి సంయమీశ్వరుడు తన తలపు సర్వము దానయి యున్నయాతని

---

3. నృసింహపురాణమున 'సూర్యకవి పుత్రసంభవ' అని కలదు.

4. ఎఱ్ఱన గురువగు శంకరస్వామి, ఎఱ్ఱన వెనుక నాతని వంశీయులకెల్ల దేశికుడైనట్లుగా, ఎఱ్ఱన వంశీయుడు మల్లన తన విప్రనారాయణచరిత్రము నందిట్లు చెప్పియున్నాడు.

భక్తకోటికి ముంగొంగు భాతి యగుచు
గరిమంబురుషార్థ సిద్ధంబు గలుగజేయు,
మామకాన్వయ దేశిక స్వామియైన
శంకరస్వామి సంయమీశ్వరు భజింతు. (18)

ఇట్లు చెప్పుటయేగాక, ఆశ్వాసాంత గద్యల యందును, ఎ[illegible]వళ, 'ఆ శంకరగురు ప్రశంసతో ప్రారంభించియున్నాడు.

'ఇది శ్రీ శంకరస్వామి సంయమీశ్వరచరణ సరోరుహధ్యానానంద సౌందర్య ధుర్య ప్రబంధ పరమేశ్వర వంశ పవిత్ర లింగమనీషి పుత్ర శ్రీ కాళహస్తీశ్వర దయాసహాయ, చదలువాడ మల్లన నామధేయ ప్రణీతంబైన విప్రనారాయణ చరిత్రంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము'

శిష్యుండగు ఎఱ్ఱయకే సాధ్యమైనది.

[6]ఆంధ్రికంబను ఎఱ్ఱయజీవితములో నాతనికి ఆదర్శప్రాయుడై యుండి మహత్త్వము చేకూర్చినది గురువు. 'శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణసరో రుహధ్యానానంద సౌందర్యధుర్యుడ'నవి ఎఱ్ఱయ సగర్వముగా తన గద్యములన్నింటిలో చెప్పుకొన్నాడు.....

శ్రీ విద్యారణ్యులు స్తోత్రము చేసిన శంకరానంద గురుపాదు లితడే కావచ్చును. కాకున్న వాతని సతీర్థ్యుడై యుండును. శృంగేరీ మొదలగు మూల శంకరపీఠముల స్వాములందఱు భారతీ సంప్రదాయ యతులగుటచే ఎఱ్ఱయ గురువు కూడ భారతీ యతియై యుండును. కర్ణాటక ప్రాంతములో శ్రీ విద్యారణ్యులు చేసినట్టి ఉద్ధరణ కార్యములే ఈ శంకరస్వామి శ్రీశైల భూమిలో చేసియుండుననుటకు సందేహములేదు. శంభుదాసుడను బిరుదు లక్షణాభిధేయము ఎఱ్ఱయకు గురువే ప్రసాదించియుండును.'

పై యుదాహృతులనుబట్టి ఎఱ్ఱన గురువు శృంగేరీ పీఠమునకు సంబంధించిన శాంకర మతానుయాయియైన, భారతీయతి సంప్రదాయువాడని స్పష్టమగుచున్నది. కాని వ్యాసకర్తల నిర్ణయము సమంజసము కాదు: సహేతుకమునూ కాదు. సరస్వతీ దేవికి పర్యాయపదమైన 'భారతి' శబ్దమును ఎఱ్ఱన వాడినంతమాత్రమున ఎఱ్ఱన భారతీయతి సంప్రదాయము వాడా? అట్లయిన, సరస్వతీస్తుతి ఘట్టమున 'భారతి' శబ్దము వాడిన కవుల గురువులందఱు 'భారతీయతి' సంప్రదాయమువారేనా? 'భారతి' శబ్దము వాడిన బమ్మెర పోతన గురువు భారతీయతియేనా? ఇక 'భారతి'ని 'పరమహంస' స్వరూపముతో పోల్చినంతమాత్రమున—శాంకర మతానుగతమైన పరమహంస పరివ్రాజకాచార్యుడని యర్థమగునా? ఇంతటితో చాలింపక—ఎఱ్ఱన గురువు విద్యారణ్యుల గురువో సతీర్థ్యులో అనియు, అతడు చేసిన 'ఉద్ధరణ కార్యములే' శ్రీశైలమున నా గురువు—చేసెననియు వ్యాసకర్తలు వ్రాసిరి. ఇది యెంతకంటె యసంగతము. ఎఱ్ఱన తన గురువునకు శ్రీశైలముతో సంబంధ మున్నదెన్నచ్చటను చెప్పియుండలేదు. ఎఱ్ఱన తన గురువు 'నిత్యశివరాత్రి వ్రతుడ'నియు, 'సదాశివ చింతానురక్తుడ'ని తెలిపియున్నాడు. శాంకరపీఠయతులు అద్వైతులుకదా, వారికి శివరాత్రివ్రతాచరణ విహితమా? పై వాక్యములన్నియు నొకదానితో నొకటి పొందికలేక—కేవల మూహలపై నాధారపడియున్నవి.

ఈ విషయము మూలముగానైన గ్రహించుటచే [7]శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు ఈ సందర్భమున నిట్లు వ్రాసియున్నారు.

"ఎఱ్ఱయ గురువు శ్రీ శంకరస్వామి. ఇతడు కామకోటి పీఠములకు చెందిన ఆచార్యుడు కాదు. నిత్యశివరాత్రి వ్రతపరుడగు శైవాచార్యుడు."[8]

శాస్త్రులవారు వ్రాసినట్లు, ఎఱ్ఱయ గురువు శాంకర పీఠమునకు సంబంధించిన యతి యెంతమాత్రమును కాదు—అతడు శైవాచార్యుడే. తెనుగు దేశమున ప్రసిద్ధమైన—ఆరాధ్యశైవ సంప్రదాయమునకు చెందిన మాహేశ్వరుడు. ఈ విషయమును ఎఱ్ఱన తన గురువునుగూర్చి వాడిన రెండు విశేషణముల మూలముగా స్పష్టపఱచియున్నాడు.

1. నిత్యశివరాత్రి వ్రతము.

2. సదాశివ చింత.

ఆరాధ్యులకు షట్కాల శివపూజ నియతము—అరుణోదయ, సవనోదయ, సంగవ, మధ్యాహ్న, సాయంకాల, అర్ధరాత్రములు షట్కాలములు.[9] ఇది ప్రతిదినము చేయదగినది. కాని ఒక్క శివరాత్రినాడు

---

5. భారతి రజతోత్సవసంచిక—ఎఱ్ఱయకవిత—శ్రీ వోరి నరసింహశాస్త్రి. పుట 267.

6. తెలుగుభాషా సమితివారి విజ్ఞానసర్వస్వము. 3 వ సంపుటి తెలుగు సంస్కృతి పుటలు 733—37. ఎఱ్ఱాప్రెగడ—శ్రీ వోరి వలసి నాశాస్త్రి—ఈ భాగమున్న పుట. 734. దీనినే సమగ్ర ఆంధ్ర సాహిత్యం గ్రంథకర్త గ్రహించారు—చూ. సంపుటము 3 పుట. 140.

7. వీ రిటీవల కీర్తిశేషులైరి.

8. 'నృసింహ పురాణ పీఠిక iv పుట.

9. శ్రీనాథ మహాకవి హరవిలాసమున—కిరాతార్జునీయ కథలో నీ షట్కాల శివపూజా విధానము వర్ణించి యున్నాడు — సప్తమాశ్వాసము — ఆఱు పద్యములు.

మాత్రము దిన మెనిమిది జాములును, శివపూజ సేయ వలెను.

పండితారాధ్య చరిత్రలో, పాల్కురికి సోమనాథుడు, బోనమయ్య శివరాత్రి శివపూజా సందర్భమున నిట్లు చెప్పియున్నాడు.

'నాల్గవసరముల నరి శివరాత్రి
నాల్గు జాములును సన్మతిం జేయువారు'
ప్రేమతో నా పగల్ రేయును జాము
జామున నర్చనల్ సరిసేయువారు.

పర్వత ప్రకరణము పుట 430.

సంవత్సరమున కొక్కసారి మాత్రమే దిన మెనిమిది జాములు చేయు శివరాత్రి వ్రతమును, శంకరస్వామి ప్రతిదినమును చేయు వాడగుటచేత, అతడు నిత్యశివరాత్రి వ్రతుడయ్యెను. దీనినిబట్టి ఎఱ్ఱన గురువు ఆరాధ్యుడు.

శైవమత సంప్రదాయమున, సదాశివతత్త్వము వాఙ్మనసాతీతమైనది. అన్నింటిని మించినది.

'శ్రీమత్సదాశివేశ్వర
నామ భవద్ధామముల మనంబున దలపం
గా మతి వాక్కున బొగడం
గా మా కలవియె సమస్త కామాతీతా'— అని పండితారాధ్యుల శివతత్త్వసారము. (16 ప.)

ఇదియేగాక, 'సదాశివ' శబ్దమునకు శైవమున నింకొక ప్రత్యేకత యున్నది— అతడు 'పంచకర్త' లైదుగురిలో నధికుడు.

'బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు' అను వారు పంచకర్తలు—(శివతత్త్వసారము. 15 ప.)

దీనివలనను నీత డారాధ్యుడనియే నిశ్చితమగుచున్నది.

ఇట్లున్నను ఎఱ్ఱన తన గురువును శంకరారాధ్యులని పేర్కొనలేదు. 'శంకరస్వామి' అనియే సర్వత్ర వాడియున్నాడు. ఇదియు నారాధ్య సంప్రదాయమే—పండితారాధ్యునిగూర్చి చెప్పుచు పాల్కురికి సోమనాథుడు

'భక్తైకదేహుండు పరమేశ్వరుండు
భక్తసత్ప్రాణుండు పండితస్వామి' (పండితారాధ్య చరిత్రావతారిక) అని వ్రాసియున్నాడు.

ఎఱ్ఱన గురువు [10]శంకరారాధ్యులని నిశ్చితమైనను, అతని చరిత్రను తెలుసుకొనుటకే యాధారము నాతని కృతులయందు లేదు. ఇతర సాధనముల నుండి గ్రహింపవలసియున్నది.

'శైవమత ప్రకాశిక'[11] అను గ్రంథములో నిట్లు గలదు.

'ఉద్భటారాధ్య వంశ్యుడగు ప్రోలనారాధ్యుడు క్రీస్తుశకము 1350 నుండి 1450 దాక సుప్రఖ్యాతులుగానున్న కొండవీటి రెడ్లకు గురువగుటచే కొండవీడునకు సమీపమగు నా మండల నగరమున ప్రవేశించి యుండెను. ప్రోలనారాధ్యునకు మనుమడైన శంకర గురుడు కొండవీటిఱేడగు పెదకోమటి వేమారెడ్డికిని వారి మంత్రియగు మామిడి ప్రెగడయ్యకును గురువైనందున శంకరారాధ్యునకు పెదకోమటి వేమారెడ్డి పినపాడను నగ్రహారము నొసగెను.'

శృంగార శ్రీనాథము తృతీయ ప్రకరణములో పై దాన శాసనమునుగూర్చి గలదు—అందులోని ముఖ్యవిషయము మాత్రమే తెలుపుదును—'ఈ శాసన కర్త శ్రీనాథ భట్టారకుడు—శా. శ. 1327 అగు పార్థివ సంవత్సర మాఘ మహాశివరాత్రి పుణ్యకాలమున పెదకోమటి వేమభూపాలుడు పినపాడు గ్రామమును శంకర దేశికునకు దానము చేసెను. ఈ దానము శ్రీశైలముమీద జేయబడినది. శివరాత్రికి వీరందఱు శ్రీశైలమున కరిగిరి. అక్కడ దానము జరిగినది. శృంగార నైషధకృతిపతి 'శ్రీగురు శంకర

10. నృసింహపురాణ పీఠిక (iv) లో 'బసవపురాణమును సంస్కృతీకరించిన శంకరారాధ్యు డెవరో తెలిసికొనవలెను' అని యున్నది. సంస్కృత బసవపురాణ కర్త శంకరారాధ్యుడు ఎఱ్ఱన గురువెంతమాత్రమును కాజాలడు. అతడు 17 వ శతాబ్దివాడు. (చూ. కర్ణాటకకవి చరిత్ర, తృతీయ భాగము.)

11. శ్రీ లోకారాధ్య ముదిగొండ నాగలింగ శాస్త్రిసర్వ్యప్రణీతము—తెనాలి 1937—పుట 15.

మౌని దయాగౌరవ నిత్యసన్మితాన్వయ' అని వర్ణింపబడినాడు. ఆ శంకరమౌని ఈ శంకరదేశికు డగు నేమో? ఎఱ్ఱాప్రెగడ గురుడొక శంకరస్వామియున్నాడు.' (పుటలు 129—130.)

పై రెంటిని సమన్వయింపగా నీ క్రింది విషయములు స్పష్టమగు చున్నవి. —ప్రోలనారాధ్యుని మనుమడగు శంకరగురుడు, శృంగార నైషధకృతిపతి యగు మామిడి [12]సింగమంత్రికి గురువు. ఈతడు క్రీ. శ. 1405 లో జీవించియున్నాడు. ఈ శంకర గురుని గూర్చిన సందర్భముననే 'ఎఱ్ఱాప్రెగడ గురుడొక శంకరస్వామి యున్నాడు' అన్నమాట పరిశీలింపదగినది. ప్రోలనారాధ్యుని సంతతివారు —ప్రోలయ వేమారెడ్డి కాలమునుండి వారికి గురువులు. కోమటి వేమారెడ్డి కాలమునగల శంకరగురునిబట్టి —వేమారెడ్డి కాలమున శంకరగురుడుండుట యసంభావ్యము కాదు. కాబట్టి ఎఱ్ఱన గురువగు శంకరస్వామి— శృంగారనైషధకృతిపతి సింగనామాత్యుని గురువగు శంకరమౌనికి తాత యగునని నా యభిప్రాయము— అప్పటీతడు—ప్రోలనారాధ్యుని మనుమడుగాక—ముని మనుమడగును.

ఈ శంకరగురువంశీయులు నేటికిని పినపాడు నందున్నారనియు, వారివద్ద ప్రోలనారాధ్యునివద్దనుండి వంశవృక్షము కలదనియు వినుచున్నాను. దానిని తెప్పించి ముందింకను ఈ విషయమై నిర్ణయము చేయగలను.

ఆరాధ్యశైవమున గురువున కెట్టి యున్నత స్థానము గలదో, ఎఱ్ఱన ఈ క్రింది పద్యమున నిరూపించియున్నాడు.

'పరగు పదార్థ పంచకము పాశములై
తను జుట్టు దూలుచున్
దిరిగెడు జీవుడన్ బశువు
దేశిక పుణ్య కటాక్ష వీథిఁ ద
త్పరమతిఁ జేరఁగా
నపరబాధ విముక్తి శుభంబు నిచ్చు నీ
శ్వరుఁడుగ నెన్నెఱుంగుదురు శైవులు
శాశ్వత చిన్మయాత్మకా (3—26)

నృసింహ పురాణమున దేవతలు విష్ణుమూర్తిని స్తుతించు ఘట్టములోనున్న [13]శరవైయేడు పద్యాలలో పై పద్య మొకటి. ఇందు శైవమతానికి మూలమైన పాశుపత సిద్ధాంతము ప్రతిపాదితమైనది. 'జీవులు పశువులు: పదార్థ పంచక ప్రకృతి సంబంధమైన— త్రిమలములు పాశములు. శివుడు పశుపతి—అతని వలననే, ఆ పాశమోక్షము సంభవించును. గురువు శివ స్వరూపుడు. అతని కటాక్షముచేత-జీవుడు మలత్రయ పాశములనుండి విముక్తుడై శివైక్యము చెందును.' ఇది ఆ సిద్ధాంత వివరణము—పండితారాధ్యుడును పాల్కురికి సోమనాథుడును దీని నిట్లు తెలిపినారు.

'జీవు లనేకులు పశువులు
భావింపఁగఁ బ్రకృతి వికృతి బంధము పాశం
బావృతములనం బశువులు
నీ వా రెంటికిని బతివి నిరుపమహేశా.'
'పశుపతియు పాశములఁ దన
పశువులకును బంధమోక్ష పద్ధతి సేయం
కుశలుఁడుగా కవి యొరులకు
వశవర్తి నేర్పుగలదె వారికి రుద్రా.'
(శివతత్త్వసారము 24, 25 పద్యములు)
'స్వకృపావలోకనోత్సారితశిష్య
నికర మలత్రయు విరసితేంద్రియుడు.'
(పండితారాధ్య చరిత్ర—అవతారిక
పండితారాధ్య గురువర్ణన)

పాల్కురికి సోముని—ద్విపద పంక్తులయందలి యర్థమే ఎఱ్ఱనపద్యమున 'దేశిక పుణ్యకటాక్షవీథి' 'అపరబాధ విముక్తి'గా పరిణమించినది.

ఇంతవఱకు ఎఱ్ఱన గురువునుగూర్చి ప్రస్తావించాను. అతడు ఆరాధ్యుడని నిరూపించాను. గురువు ఆరాధ్యుడైనప్పుడు శిష్యుడు ఆరాధ్యుడేయగును. ఎఱ్ఱనయే మనకు సందేహము లేకుండ తనతండ్రి సూరనార్యుని 'ఆరాధ్య సర్వజ్ఞుడు' (పీఠి. 25) అని పేర్కొన్నాడు. ఆరాధ్యసర్వజ్ఞుడనగా ఆరాధ్య

12. శైవమత ప్రకాశికలో మామిడి ప్రెగడయ్యకు గురువని యున్నది. ప్రెగడయ్య సింగనకు పెద్దన్న.

13. ఇది నక్షత్రమాలాస్తవము — ఎఱ్ఱన 'సూక్తి వైచిత్రి'లో నిది యొకటి. ఇచట సంఖ్యా వైచిత్రి.

లలో శ్రేష్ఠుడు అని అర్థము.

ఇక ఎఱ్ఱనకూడ ఆరాధ్యుడేయని అతని మత మారాధ్యశైవమని అతని హరివంశమునుండి ప్రమాణములు చూపుచున్నాను.

ఆరాధ్యశైవమున గురువుతోపాటు 'దీక్ష' ప్రధానమైనది. ఇక్కడ 'దీక్ష' అనగా లింగధారణ దీక్ష అని యర్థము. ఈ దీక్షను గురువువద్దనే గ్రహింపవలెను. వ్యవహారములో దీనినే దీక్షపుచ్చు కొనుటయందురు[14]. ఈ దీక్షలేని వా రారాధ్యపదమునకుగాని శివపూజకుగాని యెంతమాత్ర మర్హులు కారు[15], శివసంబంధమైన యీ దీక్షకు 'శివదీక్ష' లేక 'శాంభవదీక్ష' అనిపేరు.

ఎఱ్ఱన తన గురువువద్ద ఈ శాంభవదీక్షను పొందినట్లుగ హరివంశమున నిట్లు వ్యంగ్యముగా చెప్పియున్నాడు.

''చిగురుం గెంజిడలొప్ప
బుష్పరజముల్ పెల్లార వన్యూదిపూఁ తగ
లేఁదేఁటులు చుట్టుకొలుజపన్మాత్రశీలుగాఁ
గోకిల ప్రగుణాత్తాధ్యయనంబులతోడ
సకలారామంబులున్
శాంభవంబగు దీక్షావిధి నొందగా నెలసెఁ
జైత్రారూఢి విశ్వంబునన్.

(ఉ. 7—58.)

పైకి కేవలము ఋతువర్ణనగా పై పద్యము కనబడుచున్నను ఈ పద్యమునగల యర్థము గంభీరమైనది.

ఎఱ్ఱన యిందు, శివదీక్షా విధానము తెల్పుటయే గాక, అమేయమైన భావుకతను ప్రదర్శించినాడు.

'అంతా రామమయం బీజగ
మంతా రామమయం' అన్నట్లుగా ఎఱ్ఱన
సకలారామములు—అంతా శైవమయం బీజగ
మంతా శైవమయం'బని శాంభవ
దీక్ష పొందినవి.[16]

పై పద్యములో 'శాంభవంబగు దీక్షావిధి,' 'శాంభవదీక్ష'. 'హరుడు గురుడు శాంభవ దీక్షన్'— అని శివతత్త్వసారమున 'శాంభవ దీక్షాభిజాతానువర్తి' అని పండితారాధ్య చరిత్రమున గలదు.

వాస్తవికార్థ మిట్లుండగా పూర్వోక్త విమర్శకు లెట్లు వ్రాసిరో చూడుడు.[17]

'చిగురుం గెంజిడ లొప్ప........
.........................
.........శాంభవం
బగు దీక్షావిధి నొందగా నెలసె
జైత్రారూఢి విశ్వంబునన్'

మంత్రదీక్షా భేదములలో విపులమైన ఒకానొక విధానమునకు శాంభవీదీక్షయని సంకేతనామము కలదు. దాని ఫలము తంత్రములలో నిట్లున్నది.

'గురో రాలోకమాత్రేణ
భాషణాత్ స్పర్శనాదపి
సద్య స్సంజాయతే జ్ఞానం
సా దీక్షా శాంభవీ మతా.'

ఈ వాక్యములకు పైగా నందే యిట్లున్నది.

'ఎఱ్ఱయ పూర్ణదీక్షాభిషేక పవిత్రీకృతాంగుడు. అతని దీక్షానామము కల్యాణయోగియా యను సంశయము కలుగును. కాని విజ్ఞానయోగి.'

పై విషయములు విమర్శించుటకు నా కధికారము చాలదు కాని ఒక్కటి చెప్పక తప్పదు. ఎఱ్ఱన పద్యమందలిది—శాంభవంబగు దీక్ష గాని శాంభవీదీక్ష కాదు. శాంభవ దీక్షితులగు ఆరాధ్యులకు దీక్షానామము లుండవు. వారిని 'శివయోగు'లని మాత్రము వ్యవహరించుట కలదు.

---

14. నేటికిని ఆరాధ్యులలో—'దీక్ష పుచ్చుకొన్నారా' అనే వాడుక యున్నది.

15. ఈ సంప్రదాయము తెలుపుటకే పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో ప్రథమ ప్రకరణమును 'దీక్షా ప్రకరణము' అని వ్యవహరించి యున్నాడు.

16. ఈ పద్యానికేకాక హరివంశంలో ఎన్నో పద్యాలకు వ్యాఖ్యానం వ్రాయవలసిన ఆవశ్యకత ఉన్నది—మఱొక అవకాశం చూచుకొని వానిని గుఱించి తెలుపుతాను.

17. భారతి రజతోత్సవ సంచిక—ఎఱ్ఱయ కవిత, పుట 268.

"రుద్రావతారుండు ప్రత్యక్ష
రుద్రుండు మల్లికార్జున శివయోగి'
(దీక్షాప్రకరణము)

అని మల్లికార్జున పండితారాధ్యులనుగూర్చి పాల్కురికి సోమనాథుడు వ్రాసియున్నాడు.[18]

మన కుపలబ్ధములైన శైవస్తోత్రము లన్నిటిలో 'మహిమ్నము' అనబడు శివమహిమాస్తవము అతిప్రాచీనమైనది. ఆరాధ్యులు దీనిని శివపూజా సమయమున పఠింతురు—మల్లికార్జున పండితుడు లింగార్చనా సమయమున దీనిని పఠించినట్లు పాల్కురికి సోమనాథుడిట్లు వ్రాసియున్నాడు.

'అక్కజంబుగ పట్టన్న యంగ విక్రియలు
వెక్కసురీతులు వేతులుట్టంగ
గద్గదకంఠావికస్వరరస స
ముద్గత స్తవన సంయుత వాక్యుడగుచు
..........................
మహిఁజెప్పబడు 'మహిమస్తవంబున'ను
మహిమాకరుని మహామహిమఁ గీర్తించు

(దీక్షాప్రకరణము—ఆరాధ్యదేవుని లింగార్చన)

ఇట్లొక్కచోటనేగాక పర్వతప్రకరణమున భక్తులు దీనిని చదువుచున్నట్లు వ్రాసియున్నాడు.

'స్తుతి మూలమగు మహాస్తోత్ర సూక్తములు
మలహణంబును మహిమ్నంబనుస్తవము
నరుదొంద జదువుచునంకించువారు'

ఆరాధ్యులకు పారాయణ గ్రంథమగు నీ మహిమ్నమును ఎఱ్ఱన హరివంశమున ననుసరించి యున్నాడు.

హరివంశోత్తర భాగమున నాలవ యాశ్వాసమున శ్రీకృష్ణుడు కైలాసమునకువెళ్లి శివుని సందర్శించిన ఘట్టము గలదు. అప్పుడు శ్రీకృష్ణుడు శివుని స్తుతించు సందర్భమున ఎఱ్ఱన 14 పద్యములు వ్రాసియున్నాడు. వానిలో కొన్ని మహిమ్నమున కనుకరణములై యున్నవి.

'వినుఁగొనియాడ నేర్తునని
వికృవ మెవ్వఁడు శక్తియుక్తుఁ
డెవ్వని మనమున్ మనీషయును వ్రాటిలు
నెవ్వని జిహ్వసాగు
నే యనువు ప్రశంస చెప్ప
సకలార్థ సహిష్ణుడవీవు
పైఁడంగా జను పరమేశ!
మాదృశుల సంస్తుతి చాపలముల్ వృషధ్వజా'
55 ప.

మూ. మహిమ్నః పారం తే
పరమ విదుషో యద్యసదృశీ
స్తుతి ర్బ్రహ్మాదీనా మపి
తదవసన్నా స్త్వయి గిరః
అథావాచ్యస్సర్వః
స్వమతి పరిణామావధి గృణన్
మమాప్యేష స్తోత్రే
హర నిరపవాదః పరికరః శ్లో—1.

'ఉరుఖట్వాంగకపాలభస్మభుజగాద్యుద్దామ
చిహ్నంబు లట్లరుదై యొప్పు
ప్రథమాళభూతవికృతవ్యాపారముల్
సూడ్కికిన్ పరమౌత్సుక్య మొనర్పఁగా నెసగు
రూపం బొందకీవున్న
నెవ్వరు సర్వజ్ఞ!
యెఱుంగువారు
భవదవ్యక్తాద్య సూక్ష్మాత్మకృతిన్' 46 ప

మూ. మహోక్షః ఖట్వాంగం
పరశు రజినం భస్మ ఫణినః
కపాలం చేతే యత్తవ వరద
తంత్రోపకరణం
సురా స్తాం తా మృద్ధిం దధతి తు
భవద్భ్రూ ప్రణిహితాం
నహి స్వాత్మారామం
విషయ మృగతృష్ణా భ్రమయ . శ్లో 8

'మేదిని తోయముల్ శిఖి
సమీరుడు మిన్ను రవీందు లాత్మనా
నైదును మూఁడు నీతనువులై వెలుగొందఁ
బ్రపంచ నిష్ప్రపంచోదిత భావకర్తవయి
యొక్కడవుం దనరారుచుండు

18. 'నేటికిని ఆరాధ్యులతో 'శివయోగి' అనుపేరుగల వారున్నారు. కాని అది ఎల్లప్పుడు వారి నిజనామముతో చేర్పబడియేయుండును. ఉదా: నాగలింగ శివయోగి.

లోకాలివి నిన్నెఱుంగు బుధు
డెవ్వ గణించునె విశ్వవందితా. 48 ప.

మూ. త్వమర్క స్త్వం సోమ స్త్వమసి
పవన స్త్వం హుతవహ
స్త్వమాప స్త్వం వ్యోమ త్వము
ధరణి రాత్మా త్వమితి చ
పరిచ్ఛిన్నా మేవం త్వయి
పరిణతా బిభ్రతు గిరం
న విద్మ స్తత్తత్త్వం వయ మిహ తు
యత్త్వం న భవసి శ్లో.—27.

'హుతభుజుఁడును యజమానుఁడు
హుతమును నీవయని చెప్ప చు
శ్రుత మఖములు నీ క్రియములు
క్రతు ఫల దాతయును నీ వొకండవె రుద్రా 51.

'క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి
ఫలయోగే క్రతుమతాం
క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి
పురుషారాధనమృతే
అత స్త్వాం సంప్రేక్ష్య
క్రతుషు ఫలదాన ప్రతిభువం
శ్రుతౌ శ్రద్ధాం బద్ధ్వా
కృతపరికరః కర్మసు జనః.
శ్లో. 20.

'దక్షుఁ డధికుఁడై చెడి యోఁ
డిన్మఖమందుఁ గడంగి
బాహుదంతాక్షిలసద్బలాదిగ
సహాయము వొంది
రనేక నిర్జరుల్ ప్రక్షతులైరి
నీ మదుటిపాపకుఁ దేచినఁ గాలు గాలుడున్
రక్షకుఁడైన నీ వొకఁడ రాజవు
రాజకళావిభూషణా. 49.

క్రియాదక్షో దక్షః
క్రతుపతి రధీశ స్తనుభృతా
మృషీణా మార్త్విజ్యం
శరణద సదస్యాః సురగణాః
క్రతుభ్రేష స్త్వత్తః
క్రతుఫలవిధాన వ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధా
విధుర మభిచారాయ హి మఖాః.
శ్లో. 21.

పై పద్యము మూలమునకు భిన్నముగనున్నను, మహిమ్నమునందలి మొదటి పాదమునే గ్రహించి, దక్షాధ్వరధ్వంస విధానమును మాత్రమే ఎఱ్ఱన వివరించె నని తెలియనగును.[19]

ఇట్లు మహిమ్నమునుండియేకాక, శైవుల కారాధనీయుఁడగు కాళిదాస మహాకవి కృతులనుండి భావములను గ్రహించియున్నాడు —

'ఎనిమిది మూర్తుల నెవ్వఁడీ సర్వ ప్ర
పంచంబు దానయ్యె పరగి యెవ్వఁ
డఖిలంబునకు నంతరాత్మయై యెవ్వఁడు
సాంఖ్యయోగ జ్ఞానసరణిఁ దోచు
వాఁ డనాద్యంతుఁ డాద్యంత విధాయి యిం
తకు నన నెవ్వఁడు దినర్కశశుల
వేల్పులకును వేల్పు విభులకు విభుఁ డెవ్వఁ
డచల భక్తికి గమ్యుఁడై వెలుంగు

నమ్మహాదేవుఁ డభిరూపితానుభావుఁ
డప్రమేయుండనంతదయావిధేయుఁ
డచ్యుతానుగ్రహప్రీతి నరుగుదెంచె
నద్రిజయు దాను వృషభవాహనము నెక్కి—
ఉ. 6—32.

మూ. వేదాంతేషు యమాహు రేక పురుషం
వ్యాప్త స్థితం రోదసీః
యస్మి న్నీశ్వర ఇత్యనన్య విషయ
శ్శబ్దో యథార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షుభి
ర్నియమితః ప్రాణాదిభి ర్మృగ్యతే
స స్థాణుః స్థిర భక్తియోగసులభో
నిశ్శ్రేయసాయాస్తు వః —

విక్రమోర్వశీయము—నాందీ శ్లోకము.

పై మన మొదటి పాదము —

---

19. దీనిని ఎఱ్ఱనకన్న ముందుగా నన్నెచోడ మహాకవి తన కుమారసంభవమున [1] మూలానుసారముగా నాంధ్రీకరించియున్నాడు—కుమారసంభవము.2.

"అష్టాభిర్యస్య కృత్స్నం జగదపి తనుభి
ర్బిభ్రతో నాభిమానం"

అను మాళవికాగ్నిమిత్ర నాందీ శ్లోకపాదమునుండి గ్రహింపబడినది.

ఇట్లు ఎఱ్ఱన—ఆరాధ్య సంప్రదాయమువాడని శైవుడని నిరూపితమైనను, ఇంతవఱకు వాఙ్మయ చరిత్రకారులు—సాహితీవిమర్శకులు నాతని స్మార్తుని గానే పరిగణించిరి. ఈ పరిగణనకు కారణము నృసింహ పురాణమునందలి యీ క్రింది పద్యము.

"గిరిశపదభక్తిరస త
త్పరభావము కలిమి శంభుదాసుఁడనంగా
బరగియు గోవిందగుణా
దరసంభృత సౌమనస్యధన్యుఁడ నెందున్—
(పీఠి -18).

శివభక్తి పరుడనని బాహాటముగా ప్రకటించు కొనుచు, ఎఱ్ఱన విష్ణుకథలగు నృసింహపురాణ, రామాయణ, హరివంశములు (కృష్ణకథ) రచియించుట సాహితీలోకమున సంచలనము గలిగించినది. "ఎఱ్ఱన శంభుదాసుడు—అటులయినను విష్ణుభక్తుఁడు"[20] అను నభిప్రాయమునకు నవకాశ మిచ్చినది.

'శైవులకు విష్ణుద్వేషము విహితము' అనే లోకసామాన్య ప్రవాదము ననుసరించియే ఎఱ్ఱన మతమును గూర్చి భేదాభిప్రాయములు పొడసూపినవికాని వాస్తవముగా, శైవసంప్రదాయములను సూక్ష్మముగా పరిశీలించినట్లయితే, ఇట్టి భేదమున కాస్కారమే లేదు—ఆవివరణమది:

శైవులు విష్ణుపారమ్యము నంగీకరింపరేకాని విష్ణువు నెంతమాత్రమును ద్వేషింపరు. పైగా, విష్ణువును వారు వీరశైవాగ్రగణ్యునిగా శివభక్తునిగా మహాపాశుపతునిగా భావింతురు. శివపూజా సమయమున శైవులు పఠించువానిలో నీ క్రింది శ్లోకము గలదు.

"దుర్వాస కశ్యప విరించి మృకండుపుత్ర
దేవేంద్ర బాణ హరి కృష్ణ దధీచి రామాన్
శ్రీవామదేవ కవి కుంభజ గౌతమాదీన్
పుణ్యా నిమాన్ పరమపాశుపతాన్ స్మరామి."[21]

పై శ్లోకమున శ్రీహరియగు విష్ణువే గాక, అతని యవతార మూర్తులగు శ్రీరాముడును కృష్ణుడును స్మరింపబడుచున్నారు. విష్ణువు శైవమున స్మరణీయుడగుట శివపూజయందేగాక సాహిత్యమున వ్యవహారమున ప్రచురముగా నున్నది—పండితారాధ్యుల శివతత్త్వసారమున విష్ణువరేణ్యా! గోవింద ప్రియ భావుక! అని శివసంబోధనలు. నన్నెచోడుడు—విష్ణు స్తవమును చేసియున్నాడు. మూర్తీభవించిన శైవమగు పాల్కురికి సోమనాథుని తండ్రిపేరు విష్ణురామదేవుడు. తల్లి శ్రియాదేవి. శివభక్తులతో రామయ్య, కేశవరాజు, గోవిందనామములు నున్నవి. దీనివలన శైవులకు విష్ణువునం దాదరణముండుట తన్మత సంప్రదాయికమేయని తెలియదగును[22]. ఎఱ్ఱనయు శంభుదాసుడై—అనగా ఆరాధ్య సంప్రదాయమువాడైయుండి నను—'గోవింద గుణాదర సంభృత మనస్కుఁడ' గుట పై మత సిద్ధాంత మూలముగానని గ్రహింపవలెను.

అట్లయిన, పండితారాధ్య, నన్నెచోడ, పాల్కురికి సోమనాథుల శైవగ్రంథములలో విష్ణుసంబంధించిన కథ లెందుకు లేవు? అన్న సందేహము సాహిత్య విమర్శకులకు గలుగవచ్చును. కాని అట్టిసందేహమున కవకాశమే లేదు. ఏలననగా, పై శివకవుల గ్రంథములన్నియు, శివపారమ్యమును ప్రతిష్ఠించు వీరశైవమత సిద్ధాంత గ్రంథములు. వీనిలో శివోత్కర్ష, శివమహిమనిరూపణము, శైవమత తత్త్వము భక్తిమహాత్మ్యము—శివభక్తులకథలు—పరమతఖండన, అన్యదేవతానిరసనము ప్రధానముగా నుండును. ఇందలి భక్తుల కథలన్నియు దేశీయములేకాని పౌరాణికములుగావు. కాబట్టి పౌరాణికమైన విష్ణు కృష్ణ కథలకిందు ప్రసక్తియే మాత్రమును లేదు. ఇవి యన్నియు ప్రాయికముగా మతగ్రంథములేయైనను లోకోత్తర కావ్యకళా విశిష్టత గలిగి యుండుటచేత సాహిత్యమున నొక ప్రత్యేక ప్రతిష్ఠ బడసినవి. నన్నయ తరువాత రెండు శతాబ్దులాంధ్ర సాహితీ స్వరూపమునే

20. నృసింహపురాణ పీఠిక. iv.

21. ఈ శ్లోకము వీరశైవ దీక్షావిధానము విశదీకరించు 'చిన్మయదీక్ష' అను గ్రంథమున నున్నది.

22. ఈ విషయమై పూర్తిగా నా'పోతన' అను గ్రంథమున 22–26 పుటలలో చర్చించితిని. దానిని 'నేషనల్ బుక్ట్రస్టు ఇండియా'వారు ప్రకటించిరి.

మార్పుచెందినది. ఆ కాలమున దేశమున వ్యాప్తమైనది ఆరాధ్యము శైవముమాత్రమే. తిక్కన శివకవులచే ప్రభావితుడై ప్రబోధితుడైనను శైవమత సాహిత్యమును వీడి శైవుడైనను పౌరాణిక సాహిత్యమగు భారతము స్వీకరించెను. దీనితో శివకవుల గ్రంథములు సాహిత్య ప్రపంచమున వెలువడినవి. భాషా రచనా కావ్యవస్తు భేదముచేత కుండలీకరింపబడినవి. ఇంతేకాక తిక్కన మతమునందును శివకేశవాభేదమును నిరూపించు 'హరిహరతత్త్వము' ప్రతిపాదించుట శివుడే ప్రధాన దైవముగాగల ఆరాధ్య శైవ సంప్రదాయము చక్కగా సాహిత్యమున అభివ్యక్తము కాకపోయినది.

ఎఱ్ఱన యట్లుగాక, శైవసంప్రదాయికమగు తన శంభుదాసత్వమును ప్రత్యేక వ్యక్తిత్వమును నిలుపుకొనుచు విష్ణు సంబంధ పౌరాణిక కథలను అసమాన రీతి రసోల్లసితముగా సంతరించియున్నాడు. ముందు నేను చూపిన శ్లోకమునగు శ్రీరామకృష్ణులనుగూర్చి రామాయణ హరివంశములను రచించుటయేగాక విష్ణువు నాల్గవ యవతారమైన నరసింహావతార కథనుకూడ నృసింహపురాణముగా చెప్పియున్నాడు. తానిట్లు రచించుట చేతనే తన తరువాత శైవుడైన పోతనకు—విష్ణుభక్తి ప్రతిపాదికమైన భాగవతమును వ్రాయుటకు మార్గదర్శియయ్యెను.[23]

ఎఱ్ఱనయేగాక నాతని వెనుక తద్వంశీయు లందఱు శైవాచారులుగానే యుండినట్లు, పూర్వోక్తమైన విప్రనారాయణ చరిత్రలోనున్న యీ క్రింది పద్యములవలన తెలియవచ్చుచున్నది.

కృతిపతి తన్ను పిలిపించిన సందర్భమున నిట్లు వ్రాసియున్నాడు.

వినయోన్నతుఁ గామాక్షీ
జననీనందనుని సరససాహిత్యజనీ
జనకుని వార్వేలాన్వయ
జనితుని శ్రీవత్సగోత్రు శైవాచారున్—
(1—17)

రాజుల్ మెచ్చఁగఁ జెప్పె కావ్యములు
పేరాళంబుగా నద్రిక
న్యాజానిన్ భజియించు నిత్యవిరతిం
దత్కాల పూజాక్రియా
భ్రాజిష్ణుత్వమునన్ జపించు
దినమున్ బంచాక్షరీ మంత్రమున్
తేజోవంతుఁడు లింగనార్యుడు
గుణోత్కృష్టుండు మా తండ్రియున్.
(1—20)

తన వంశకర్తయైన ఎఱ్ఱన ననుసరించి శైవాచారుడగు మల్లనయు, విష్ణుభక్తి ప్రతిపాదకమగు రుక్మాంగద చరిత్రము (ఏకాదశీ మాహాత్మ్యము)నే కాక కేవల విశిష్టాద్వైత మత సిద్ధాంతమును ప్రతిపాదించిన పన్నిద్దఱాళ్వారులలో నొకడైన 'తొండరడిప్పొడి ఆళ్వారు (భక్తాంఘ్రిరేణువు) కథను విప్రనారాయణ చరిత్రమును రచియించియున్నాడు.

ఈ శైవవైష్ణవ సమన్వయదృష్టిలో నెఱ్ఱన గ్రంథములనేగాక ప్రాచీనకవుల గ్రంథములను నింకను నెంతో ప్రగాఢముగా పరిశీలింపవలసియున్నది.

---

23. ఎఱ్ఱనను పోతన స్తుతించినట్లు పూర్వముద్రితభాగములందు లేకపోయినను—నూతన ముద్రణమున గలదు—(1964). అందు గ్రంథభాగము 3 వ పుటలో—'భక్తి విశేషిత పరమేశ్వరుండగు ప్రబంధపరమేశ్వరు బ్రశంసించి' నన్నయ తిక్కనలతో పాటు ఎఱ్ఱన స్తుతియున్నది.

# ఆనో భద్రాః క్రతవో యన్తు విశ్వతః

## శ్రీ బండి నాగరాజు

భగవాన్! నువ్వున్నావు, నిజం!
నే నున్నంతకాలం నువ్వుంటావు—
నువ్వు లేనిదే నేను లేను;
అలాగే, నేను లేక—
నువ్వునయోగం లేదు: నా దృష్టితో, ఈ దృష్టితో

నువ్వెప్పుడు పుట్టావో
తన పుట్టుక తెలియని మానవుడు ఊహిస్తూనే వున్నాడు.
నువ్వెంతగా మారావో?
మారుతూనే (మారడం లేదని) ఆత్మవంచన చేసుకుంటున్న మానవుడు,
మహాభక్తుడుగా మారుతున్నాడు;
నీ మార్పు గుర్తించలేకున్నాడు.
ఇంత విజ్ఞానంత ఇన్ని సదుపాయాలు, ఇన్ని షస్సు, ఇంత మార్పు—
మేమే సాధించామే,
ఇప్పుడు నువ్వెంతగా మారి వుంటావో?
మనిషి మారంగ, నువ్వు శిలాక్షరంగా వుంటావని
నేను దుర్భ్రమ పడవచ్చునా?

* * *

ప్రభూ!
శంతతధారగా నా ఆలోచనల్ని స్పర్శించి
పవిత్రీకరించు: పటిష్ఠం చెయ్యి.
ముందు చూపులేక మూఢంగా బ్రతకలేను!
పదుగురినీ దృష్టిలో వుంచుకొని వచ్చే (నా) ఆలోచన, నీది!
(అది) నీ పవిత్రహృదయాంతరాళంలోనించి వచ్చేది!!

ఆనో భద్రాః క్రతవో యన్తు విశ్వతః

అది స్వేచ్ఛావాయువులు పీల్చుకొని
నా మానవజాతికి అభివృద్ధి మార్గం చూపాలి !
అందరికీ ఆనందదాయి కావాలి !!
అది, నువ్వెంతగా మారావో, నీ అంతస్తేమిటో చూపుతుంది!

సర్వేశ్వరా !
నాకు, నా జాతికి అలాంటి ఆలోచనాధారను ప్రసాదించు !
ఈనాటి నీ యేలుబడిలో ప్రపంచశాంతికి వాచిపోతున్నాము;
రిక్తహస్తాలతో వాపిస్తున్నావు !
పై జన్మకు గూడా నిన్నే యెన్నుకుంటాను—
ఈ జన్మకు ఈ సాయం చెయ్యి—
"ఆనో భద్రాః క్రతవో యన్తు విశ్వతః."

---





# శ్రీ తారాశంకర్ బెనర్జీ

శ్రీ ఎ. కే. ఘోష్



నిరుడు మలయాళ మహాకవి శ్రీ జి. శంకర కురుప్ కవితా సంపుటి 'ఓడక్కుళల్' కు భారతీయ జ్ఞానపీఠ్ వారి లక్షరూపాయల బహుమతి లభించినప్పుడు, భారతీయ సాహితీ జగత్తులో అపూర్వమైన ఆనంద పంచలనం కలిగింది. ఈ సంవత్సరం ఆ బహుమతి వంగ భారతి పీఠాన్ని అలంకరించింది. ఆ బహుమాన గ్రహీత సుప్రసిద్ధ వంగరచయిత శ్రీ తారాశంకర్ బెనర్జీ పేరు ప్రస్తుతం పత్రికలలో ప్రాముఖ్యం వహించింది. ఈ బహుమతి శ్రీ బెనర్జీ రచించిన 'గణదేవతా' అనే నవలకు లభించింది. జ్ఞానపీఠ్ బహుమతికి శ్రీ బెనర్జీ ఎన్నిక చేయబడ్డారు గనుక ఈ విశాల భారతంలోని, విభిన్న ప్రాంతాల ప్రజలు 'గణదేవతా' రచయిత అయిన ఆయనను గురించి తెలుసుకోవాలనే కుతూహలంతో వుండడం సహజం. గణ అంటే, ప్రజలు—ప్రజాగణం. దేవతా అంటే, దైవం—భగవంతుడు. వంగభాషలో 'గణదేవత' అంటే 'ప్రజాదైవం' అని అర్థం. ఈ వర్తమాన ప్రపంచంలో ప్రజలు పశువులకన్నా మెరుగుగా పరిగణించబడడం లేదు. భగవంతుడు తప్ప మరెవరూ వారిని ప్రేమించడం లేదు—వారి జీవితాలను, పరిశ్రమలను; వారి కష్టాలను, కలతలను; సంతోషాలను, ఆనందాలను, హక్కులకోసం పోరాటాలను శ్రద్ధగా చూచేవాడు ఒక్క భగవంతుడే—మరొకరు ఎవరు వారి అపార ఆనందపారవశ్యాలకోసం పోరాడుతారు? అయినా, శ్రీ తారాశంకర్ దేవతను తన నవలకు దివ్యమైన ఇతివృత్తంగా ఎన్నుకున్నారు; నిజానికి ఇది ఆయన

మహోత్తరమయిన, విప్లవాత్మకమైన ఎన్నిక; దీనికి చివరన అప్రతీక్షితమైన, ప్రయోగాత్మకమైన విజయం చేకూరింది. భావాలలో జాతీయవాది, దృక్పథంలో మానవతావాది అయిన శ్రీ తారాశంకర్‌ను ఈ నవల విప్లవాత్మకభావాలు గలవాడినిగా నిరూపించింది. తమ సహజగౌరవ గాంభీర్యాలతో, సౌజన్యపరసలతో జనంపై అధికారముద్ర వేయగల సాహిత్య ప్రవర్తకులలో బెంగాల్ ప్రజల మనస్సును చూరగొన్న శ్రీ తారాశంకరే బహుశా చివరివాడు కావచ్చునని ఈ సమయంలో చెప్పడం క్షేమకరం. భారతీయ సాహిత్య నవయుగ మహాప్రవర్తకుడు మరుగైపోయినతర్వాత, అంతటివాడు కాకపోయినా, సామాన్యులకన్నా కొంచెమైనా పైస్థాయిలో వుండగల వ్యక్తి సాహిత్యరంగంలో ఇక వుంటాడా?—అనే నిజమైన భయానుమానాలు ఏర్పడ్డాయి. తారాశంకర్ మాతృదేశమంతటా గొప్పగా గుర్తించబడిన అమూల్యానేదృశ రచనలను సాహిత్యానికి సమర్పించి ఆ భయానుమానాలను కచ్చితంగా నిర్మూలించారు.

శ్రీ తారాశంకర్ పశ్చిమబెంగాల్ రాష్ట్రంలోని బీర్భూంజిల్లా లవెపూర్‌లో 1898 జూలై 25 న జన్మించారు. తారాశంకర్‌కు ఎనిమిదో ఏటనే తండ్రి శ్రీ హరిదాస్ బెనర్జీ మరణించాడు. తల్లి చలవవల్ల పైకి వచ్చిన కొందరు ఉజ్వల ప్రపంచ వ్యక్తులలాగే, తారాశంకర్‌ను గూడా ఆయన తల్లి శ్రీమతి ప్రభావతీదేవి శ్రమ అనక ఎంతో శ్రద్ధతో పెంచి పెద్దవాణ్ణి చేసింది. ఆమె ప్రత్యక్ష పరోక్ష ప్రభావాలు నేటికీ, ఆయన అన్ని స్వల్పవిషయాలకు అతీతంగా ముందుకు వచ్చి, ఉన్నత లక్ష్యం సాధించడానికి మార్గదర్శకంగా వున్నాయి. ఆమె తన కుమారుని కీర్తిప్రతిష్ఠల సంతోషంలో పాలుపంచుకోవడానికి ఇంకా జీవించివుండడం అదృష్ట విశేషం.

20 వ శతాబ్ద్యుదయం భారత ప్రజల చైతన్యాన్ని తిలకించింది. స్వయం పరిపాలన సాధనమనే పరిమిత వాంఛా పూర్తికి ఉద్దేశించిన మితవాద జాతీయోద్యమం సంపూర్ణ స్వాతంత్ర్యం కోరే సాహసికులైన భారతీయ యువజనులకు ఎంత మాత్రము సంతృప్తి కలిగించ లేకపోయింది. తారాశంకర్‌కు నూనూగు మీసాల నూత్న యౌవనంలోని నిప్పులు కక్కే వంగవిప్లవ కారులతో సన్నిహితత్వం ఏర్పడింది. త్వరలోనే అప్పటి భయాందోళిత ప్రభుత్వం అతని పేరును 'బ్లాక్‌లిస్టు'లో చేర్చింది. కలకత్తాలో సెయింట్ క్సేవియర్ కళాశాలలో చదువుతూండగా అతనిని ప్రభుత్వం స్వగ్రామంలోనే నిర్బంధంలో వుంచింది; అతడు గ్రామం పొలిమేరలు దాటిపోకూడదని కట్టడి చేసింది. అంతటితో అతని విద్యాభ్యాసానికి స్వస్తి జరిగింది.

గ్రామ నిర్బంధంలో వున్నప్పుడు ఆయన జీవితం ప్రయోజనాత్మకమైన కార్యకలాపాలతో తీరికన్నది లేకుండా వుండేది. చిత్తశుద్ధిగల కర్మయోగి కావడంవల్ల ఆయన తన పైతృకమైన ఆస్తిపాస్తులను చూచుకోడం, తను నెలకొల్పిన సంఘసేవాసంస్థ పనులు నిర్వహించడం మాత్రమేకాక, కవిత చెప్పడం, నవలలు, నాటకాలు మొదలయినవి వ్రాయడంలో నూతన ప్రయోగాలు చేయడంకూడా ప్రారంభించారు. నవజాతీయ చైతన్యానికి ఆయన నాటక రూపంలో తన ప్రతిభను సమర్పించారు. ఆయన నాటకాలు పెక్కుసార్లు ప్రదర్శితమయాయి. ఒకొకప్పుడు ఆయనకూడా నటించేవాడు.

కథానికా రచయితగా తారాశంకర్‌కు కీర్తి మెరుపులాగా, ఉల్కలాగా మిరుమిట్లు గొలుపుతూ వచ్చిందనే చెప్పాలి. అతడు 1928 లో కథానికలు వ్రాయడానికి గట్టిగా ప్రారంభించారు. భారతదేశ సాహిత్యరంగంలో తనకు న్యాయమైన స్థానం కోరుకుంటున్న ఒక నవ్యసాహిత్యవర్గం 'కల్లోల్' అనే సాహిత్య పత్రికను ప్రచురించసాగింది. ఈ పత్రిక అప్పటి బెంగాల్ అభ్యుదయ రచయితల భావప్రకటన సాధనమయింది. ఈ పత్రికలో వ్రాసేవారిలో చాలవరకు (ఇంకనూ వీరు సాహిత్యరంగంలో పలుకుబడితో వున్నారు.) కొత్తవారు; అయితే ధైర్యశాలులు, యువకులు, ఉత్సాహవంతులు, విశిష్టమైన వైయక్తిక దృక్పథం గలవారు; అనుకూల ప్రతికూల విమర్శలకు దారితీసిన రచనలు చేసినవారు; అయితే వారి శక్తిసామర్థ్యాలను శంకించినవారు ఎవరూ లేరు.

తారాశంకర్ 'కల్లోల్' వర్గంతో చాలాకాలమే వున్నారు. ఆయన తన వ్యక్తిత్వాన్ని వదలుకోకుండా, 'కల్లోల్‌దిబ్మండలం'లో కథానికా రూప

మైన తొలికిరణకాంతి సౌందర్యంతో మానవ నక్షత్రంగా కనిపించారు. ఆ వైభవ ఘట్టంనుంచి, ఆ కీర్తి మజిలీనుంచి ఆయన నిరంతర, అవిశ్రాంత అశ్రాంత ఉత్సాహంతో అజ్ఞాత సర్జన సౌందర్య లోకాలకు — ప్రపంచాన్ని సుఖ సంతోషాలతో మనడానికి, మందహాసంచేస్తూ మరణించడానికి అను వుగా తీర్చిదిద్దే మానవ జీవిత మూలతత్వాలను మనకు అందించే ఉద్దేశంతో—పయనం ప్రారంభించారు.

1930 ప్రాంతంలో తారాశంకర్‌ను భారత జాతి పిత మహాత్మాగాంధీ నిర్వహించిన జాతీయో ద్యమం నెమ్మదిగా అయినా, గట్టిగానే ఆకర్షిం చింది. అతని విప్లవకర భావాలు పూర్తిగా మారి పోయాయి. జాతీయోద్యమ సమయంలో ఆయన బీర్భూమ్ స్థానిక కాంగ్రెస్ నాయకుడుగా పరిగ ణింపబడ్డారు. ఈ సందర్భంలో విదేశ ప్రభుత్వం ఆగ్రహావేశాలు ప్రజలపై పడ్డాయి. శృంఖలాలతో వున్న మాతృదేశాన్ని నిర్భయంగా ప్రేమించడమనే నేరానికి తారాశంకర్ కారాగారవాసం అనుభవించవలసి వచ్చింది. ఈ సత్యాగ్రహోద్యమ సమయంలో రచిత మైనది 'చైతాలీ ఘుర్ణీ' (వేసవి గాలిదుమారం) అనే సుప్రసిద్ధమయిన నవల. ఇది ప్రాచీన నవలా సంప్రదాయాలకు భిన్నంగా నడిచింది. అర్థ—విప్లవ స్వభావంతో రచితమైన ఈ చిన్న నవల నిజంగా మనసు చెదరగొడుతుంది. దీనిలో పాఠకుడు పార్శ్వ స్థితమైనప్పటికీ సన్నిహితమైనప్పటికీ, ఇదివర కెప్పుడూ అనుభవానికిరాని శక్త్యుత్సాహాల అను భూతిని పొందుతాడు. ఆయన సర్జనశక్తి, ఉత్తమ రచనా లక్షణాలు ఈ నవలలో కనిపించాయి. ఆ నాటి నుండి ఆయనలోని కైవాడం, విమర్శనాత్మకమైన పరిశీలన అవిచ్ఛిన్నంగా అభివృద్ధి చెందాయి. విమర్శనాత్మక పరిశీలనవల్ల ఆయనలోని ప్రతిభా శక్తులు పూర్తిగా వికసించడానికి అవకాశం కలిగింది.

ఆయన కొత్త 'ప్రాంతీయ సాహిత్య వేదికను' ప్రారంభించారు. అది నాడునాటికీ అపూర్వశోభతో వృద్ధిపొందసాగింది. సాహిత్యంలో అకలుషితమైన, సహజమైన గ్రామసీమల సొబగును మున్నెన్నడూ లేని వాస్తవికతతో చిత్రించడానికి, సజీవమైనదాని కోసం, కొత్తదనంకోసం తహతహలాడే దేశవ్యాప్త ప్రజానీకానికి ఆ సొబగును ఇంటింటికీ అందజేయ డానికి తారాశంకర్ విస్తృతభూముల, వాని సంప్ర దాయాల, ప్రజల ఇతివృత్తాలను, గాఢమైన ప్రేమతో, పెల్లుబికే అభిమానంతో చిత్రించడం ప్రారంభించారు. 'హాంసులీ బాంకేర్ ఉపకథా,' 'నాగినీకన్యార్ కాహినీ' అనే నవలలలో ఆయన ఉపేక్షిత ప్రాంతాలను, వీలసౌంద ర్యాన్ని. అడవిపూవులను, నాగరకతా విహీనమైన మానవదేహసుగంధాన్ని, నిర్మానుష్య, నిర్జనభూముల సొబగును, నాగరకత అంతటి ప్రాచీనమైన అనిరీక్షిత మతాచారాలను, నవనవోన్మేషంగా, ఇదివరకెన్నడూ అనుభూతంకాని వింత విధంగా, విస్తృతంగా వాస్తవ జీవితానికి తెచ్చారు.

ఆయనలోని ఆశ్చర్యకరమైన సర్జనశక్తి 70 ఏండ్ల వార్ధకంలోను తొణికిసలాడుతున్నది. నిత్య యౌవనుడైన తారాశంకర్ నిరంతరాయంగా కథలను, కథానికలను, పెద్దకథలను, నవలలను, నాటకాలను, వ్యక్తిచిత్రణలు మొదలయినవాటిని నిరాఘాటంగా, నిరవక్రమంగా, విరామ మెరుగని వేగంతో రచిస్తూనే వున్నారు. ఆయన యంత్రంలాగా పనిచేస్తారు; అయితే వైవిధ్యం, విలక్షణత ఎప్పుడూ తగ్గవు. ఇంత వరకు ఆయన శతాధికంగా రచనలు చేశారు. వాటిలో 40 కి పైగా నవలలు. వాటిలో ఇవి ప్రత్యేకంగా పేర్కొనదగినవి:—1. 'గణదేవతా', 2. ధాత్రీ దేవతా, 3. సాందీపనీ పాఠశాల, 4. కాళిందీ, 5. దబీ, 6. సప్తపదీ, 7. పంచగ్రామ్, 8. నాగినీ కన్యార్‌కాహినీ, 9. ఆరోగ్యనికేతన్, 10. హాంసూల్ బాంకేర్ ఉపకథా, 11. బిచారక్, 12. రాధా, 13. మంజరీ అపేరా, 14. కవి, 15. కన్నా, 16. కీర్తిహాటేర్ కడ్చా.

నాటకకర్తగానూ ఆయన విఖ్యాతి సంపా

దించారు. కనీసం ఆయన రెండు నాటకాలయినా కలకత్తా నాటకరంగాలలో నిరంతరం ప్రదర్శనభాగ్యం పొందుతూనే వుంటాయి. ఒకప్పుడు తారాశంకర్ నాటకమంటేను, నవలలంటేను, చలనచిత్రీకరణకు తప్పనిసరి అనే పరిస్థితి వుండేది. ఆయన 'కవి' అనే నవల ఆధారంగా లోగడ తీసిన ఒక చలనచిత్రం గొప్పగా జనాన్ని ఆకర్షించి విజయమైంది. దాని పాటలు అంతటా జనం నాలుకపై నిరంతరం నాట్యమాడేవి. అంతేకాక, ఆ చలనచిత్రం శాశ్వతమైన, ఉన్నతమైన, సున్నితమైన గుణశిల్పాలతో నిరంతరం స్మృతి మందిరంలో దాచుకోదగిన కళాసృష్టులలో ఒక్కటి. ఆయన రచించిన 'జల్సాఘర్' సున్నితమైన, కళాత్మకమైన ఇతివృత్తంతో శ్రీ సత్యజిత్ రాయ్ వంటి అంతర్జాతీయ చలనచిత్ర ప్రదర్శకుని ఆకర్షించి, చిత్రరూపం పొందింది.

చలనచిత్ర రూపాలలో విజయం పొందిన ఆయన ఏకరీతి రచనలను కొన్నిటి యోగ్యతను, గుణగణాలను, స్థాయిని గురించి కొందరు విమర్శకులు అభిప్రాయ భేదంతో వున్నారు. ఆయన రచనలలో కనీసం కొన్ని అయినా, త్వరగా తెరకెక్కిద్దామన్న దృష్టితో లిఖించబడినట్టు కనిపిస్తాయి. ఈ స్థాయి తగ్గడానికి తారాశంకర్ తత్కాలానికి ఏవో నీరసమైన కారణాలు బహుశా చూపవచ్చు. ఆయన ఒకమారు ఆర్థిక సంక్షోభానికి గురి కావలసి వచ్చిందనడం నిరాకరించరాని వాస్తవ విషయం. ఈ కష్టాలనుంచి బైటపడడానికి ఆయన కొంత వరకు సినిమా దొరలకు బలవంతంగా లోబడి పోవడం జరిగి వుండవచ్చు. ఈ అపవిత్రమైన భాగస్వామ్యంనుంచి వెలువడిన అపఖ్యాతి, ఆయనకు ఆత్మవివేకం, వ్యక్తి వివేకం మరల కలిగిన తర్వాత నెమ్మదిగా మాయమైపోతుంది.

తారాశంకర్‌కు కొంతకాలంగా దిన వార్తా పత్రికలతో కాలమిస్టుగా సంబంధ బాంధవ్యాలు ఏర్పడ్డాయి. ఈ రంగంలో ఆయన తన సర్జనశీలతను, సర్జనశక్తిని అపారంగా అందజేశారు. దినపత్రికలతో సంబంధం వుండడమేకాక, ఆయన పెక్కు వారపత్రికలకు, మాసపత్రికలకు క్రమం తప్పక వ్రాస్తుంటారు. 'అమృత' వారపత్రికలో ఆయన వ్రాసిన వ్యక్తి స్వభావ చిత్రణలు సుదూర వ్యాప్తమయినప్పటికీ సన్నిహితంగా దృగ్గోచరమవుతూ, విశ్వాంతరాళాన్నంతా నాలుగు గోడలమధ్యన ఇరికించినట్లు విస్తృత జీవితాన్నంతా సంకుచితపరచి చూపినట్లు కనిపించినా, ఎప్పుడూ చస్తూ, ఎప్పుడూ వూపిరి తీసుకుంటూ వుండే మన జీవితంలోని ప్రతిక్షణంలోను కదలాడుతుంటాయి. ఈ వ్యక్తి చిత్రణలో ఆయన ఒక అపూర్వ మహాశిల్పి; విశిష్టత నింపే సృష్టికర్త కూడా. ఈ మహాశిల్పి మానవ మూర్తులను సున్నితమైన నొక్కులతో, సొగసులతో గండరించడం మాత్రమేకాక, మానవులను— స్త్రీలను పురుషులను: స్వభావాలను, స్వరూపాలను; అభిరుచుల్ని, శీలాన్ని పునః అజరామరంగా సృష్టిస్తారు.

ఆయన కృషికి తొలిసారిగా బహుమతి లభించడం 1947 లో సంభవించింది. ఆ సందర్భంలో— సరిగ్గా 20 సంవత్సరాల క్రితం—శరచ్చంద్ర స్మారక బహుమతి స్వీకరించారు. తర్వాత బహుమతులు— అందరూ ఆశించే రవీంద్రనాథ ఠాగూర్ స్మారక బహుమతి, సాహిత్యఅకాడెమీ బహుమతి 1956 లో ఇవ్వబడ్డాయి. కలకత్తా విశ్వవిద్యాలయం ఆయనను

'జగత్తారిణీ పతకం'తో గౌరవించింది.

ఆయన లోకంలో వాడుకలోవున్న పద్ధతులను బట్టి కచ్చితంగా చూస్తే, పండిత వర్గానికి చెందరు కాని, ఆయన అపారపాండిత్య ప్రభలు ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో జరిగిన రాజకీయ–సాహిత్య సదస్సులలో ఆయన పాల్గొన్నప్పుడు ప్రకాశించాయి. ఆయన 1958 లో మాస్కోకు, ఆఫ్రో–ఏషియన్ మహాసభలో భారత ప్రభుత్వ అధికార ప్రతినిధివర్గ నాయకుడుగా పాల్గొనడానికి తాష్కెంట్‌కు వెళ్లాడు. అక్కడ అధికారోన్మత్తమైన చైనా అనిష్ట ప్రభావం కింద 'సాహసోపేతమైన నవ ప్రపంచం' సుదీర్ఘ శృంఖలలనుంచి అప్పుడే విడివడిన ఆఫ్రో, ఆసియా దేశాలపై పెకింగ్ పన్నదలచిన దురాక్రమణ పథకంలో భారతదేశం కూడా భాగం కావాలనే వాస్తవమైన దురుద్దేశాన్ని ప్రతిఘటించే సదవకాశం — గర్వించదగిన సదవకాశం, కలిగింది. ఆనాడు ఆయన అనుమానించిన దురుద్దేశాలు ప్రస్తుతం చరిత్రలో లిఖితమైన సంఘటన పరంపరవల్ల వాస్తవమైనవని నిర్ధారితమయ్యాయి. విద్వత్పూర్వకమైన చర్చలు ఎంత గొప్పవయినా, ఆఫ్రికా—ఆసియా మేధావుల అభ్యుదయ మహాసభ అనబడే దాని రహస్యోద్దేశాలను బహిరంగంగా నిరసించడంవల్ల కలిగించిన గొప్ప ప్రభావం పరిణామాలను కలిగించేవి కావు కదా!

మానవజాతిపైన, ప్రజలపైన, పవిత్రతపైన; సత్యసౌందర్య మానవతా మతాలపైన; చిత్తశుద్ధి సామరస్య, దివ్యజోతులపైన విశ్వాసం ఊగిసలాడుతున్న ఈ రోజులలో, వందలకొలది సుప్రసిద్ధ రచయితలలో తారాశంకర్ అరుదైన దృష్టాంతం. తారాశంకర్ మానవజాతిపక్షాన, ప్రజలపక్షాన, పవిత్రత పక్షాన, సత్యసౌందర్య మానవతా మతాలపక్షాన, చిత్తశుద్ధి, సామరస్య అమర దివ్యజ్యోతులపక్షాన నిలబడుతారు; అంతేకాదు; చిరాభివృద్ధి పొందుతూ, చిరంజీవిగావున్న మానవాళికి ఆధ్యాత్మికానంద సంధాయకమైన సర్జనకళలో విశ్వాసం వుండాలని తన రచనంతో జనాన్ని ఉత్సాహోద్దీపితులను చేస్తున్నారు.



# కోయిల దొర

శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

శీతాకాలపు మౌనముద్ర
వదలి కదలి కోయిల దొర
ఇంపుగ గళ మెత్తి తరుణ
మేలెంచిన దివ్వాళ్ళకు

ఇక కేవల మొక కోకిల
మృదు గీతామృతసారమె
వెల్లిగొని రసానందము
వెల్లువలగు ననుకొంటిని

కాని కాక ఘూకమ్ముల
కర్కశ కటుకంఠమ్ముల
అగడమ్ము లాగిపోక
సాగుట కనుగొనుచుంటిని

గుప్పిట చిమ్మిన కైవడి
పుప్పొడి బుక్కావలె పడి
గాడ్పుతోని విలువెల్ల ను
గంధితమగు ననుకొంటిని

కాని యెత్తిపోసిన చం
దాన ధూళి పైపైబడి
పవనుడు కలతంబడి నుడి
బడసాగుట కనుచుంటిని

పొడమిన ప్రతి మొగ్గ తేనె
బుగ్గయై గుబాళింపగ
పుడమి మధు సముద్రమ్మై
పొంగులెత్తు ననుకొంటిని

కాని లోని ప్రాణుల వా
ర్కాల తడి విప్పుట యెట్లను
భయమున కొలకుల గుండెలు
పగులుట కనుగొనుచుంటిని

గుండెల అంచుల మెత్తని
కోయిలతో చప్పరించు
మంచు పీరపించి ఉల్ల
సించు కొండ లనుకొంటిని

కాని కోటి కొలిములతో
కదలివచ్చి చిచ్చుల దొర
కొండల గుండెలపై అడు
గులు మోపుట కనుచుంటిని

చైత్రము సర్వశుభావహ
మిత్రము జగతిని సుఖైక
సత్రముగా తీర్చు ప్రణుతి
పాత్రముగా ననుకొంటిని

కానీ నా ఊహలెల్ల
కల్లలుగా తేలిపోయె
కలతలు కల్లోలమ్ములు
తలనూపుట మానవాయె

నిర్విణ్ణుడనై నిల్చితి
నిశ్చేష్టుడనై పొల్చితి
లోకము దెస చూడలేక
లోనికి చూపు మరల్చితి

"ఎంత పిచ్చివాడవు నీ
వెంత వింత తలపోతలు
ప్రకృతి ఒక్క తీరుననే
పరిమళించు ననుకొంటివ?

చేదు తీపి కలిసినదే
సృష్టియని గ్రహింప వేమి?
చేదు లేక తీపి తీపి
కాదని గుర్తింపవేమి ?

నిలువుము పికగీతమునకె
పులకించు రసాలమవై
కర్కశ స్వరమ్ములు నీ
కర్ణమ్ముల దూఱరావు

ఆ లేచు పరాగమ్మున
కేల వృథా చింతింతువు
నీ మనస్సరోజమ్మున
నెగయునిమ్మ పరాగమ్మ

అమృతమ్ములు నీ కన్నుల
అలలు వాఱుచున్న చాలు
కొలకు లెండిపోవు గాక
కలుగవే ప్రమాదమ్ములు

సంకోచింపక ధైర్య
స్థైర్యమూర్తివై నిలువుము
నిలువున దావాగ్నుల గుం
డెలు నీరై పోవు సుమ్ము!

నీ చూపులు సాహిత్య పు
నీతమ్ములు చేసికొమ్ము
కళ్యాణ విశేషములే
కని ప్రసన్నతను గందువు

హాలాహలమును గర్భమ్మున
అమృతరేఖ ప్రవహించును
రుచి చూడగ నేర్చిన వా
లుకల నద్ది అలరించును

జ్వాలల కెరటమ్ముల ఘన
సార రేఖ తారాడును
అనుభవింప నేర్చిన హృద
యమ్ముల నది పారాడును"

అను వాక్కులు బుక్కులవలె
అంతరాంతరముల మొరసె
సహస్రదళ పద్మమువలె
చక్కగ నా మోము మెరసె

ముండ్లిక నా కనుల ముందు
మొనదేలుట విరమించును
సొగసులు సోగలు దేరిన
సుమవస్త్రులయై మించును

ఇక నా చూపులు కేవల
చకోరమ్ములై సాగును
అమృత జ్యోత్స్నాంగనా ప
టాంచలమ్ముపై మూగును.

---

# లేఖలు

## పాత తెలుగు పద్యాలలో యతి నియతి లేదా?

ఆర్యా,

డా. వేలటూరి వేంకటరమణయ్యగారు ప్రకటించిన 'జినవల్లభుని గంగాధరం శిలాశాసనము' (క్రీ.శ. 945 ప్రాంతము)లోని తెలుగు కంద పద్యాలు మూడు చూచిన తర్వాత ఈ మాట వ్రాస్తే బాగుంటుందేమోనని తోస్తున్నది.

సదరు శాసనంలోని మూడు పద్యాల్లో కడపటి పద్యంలో మాత్రం యతులు లేవు. పై రెంటిలోను వున్నవి. అందుకు, 'ఈ మూడు కందపద్యములలోను మొదటి రెండును తెనుగు కవిత సంప్రదాయానుసారము యతిప్రాసలతో కూడియున్నది. మూడవ పద్యమునందు ప్రాసముగలదుగాని యతి లేదు. ఇందు శాసన రచయిత యేలనో కన్నడ కవిత్వ సంప్రదాయము ననుసరించినాడు' అని వ్యాసకర్తలు చెప్పిరి.

దీనిమీద నాకొక అనుమానం కలుగుతున్నది. అసలు, అప్పటి తెలుగు పద్యాలలో యతులు లేవేమో?

సంస్కృతంలోని యతి(=విచ్ఛేదం) తెలుగులో లేదు; రేచన—వళీ, విశ్రాంతీ రెండు వుండా లన్నాడు. (సుమతి వేమన శతకాల్లో కావాలంటే చూడవచ్చు. తెలుగులోని వళి (=అక్షరమైత్రి) సంస్కృత కర్ణాట భాషల్లో లేదు. (ఉంటే అది యాదృచ్ఛికం, లేక ఆలంకారికం.) అరవంలో ఒక తెగ పద్యాలకు వళి వున్నదట. మన పాత తెలుగులోను ఈ వళి నియమం వుండేదా? లేక ఐచ్ఛికంగా వుండేదా? పెద్దలు పరిశీలించాలి.

పై శాసన పద్యాలనుబట్టి చూస్తే, ఈ యతినియతి ఐచ్ఛికమేమో ననిపిస్తున్నది. కాకపోతే, అసలీ నియమమే లేదేమో ననిపిస్తున్నది.

మొదటి రెండు పద్యాల్లోనూ యతి యాదృచ్ఛికమేమోనని నాకు అనుమానంగా వున్నది:

“జిన భవనము—జిన పూజల్—జినమునులకు—జినవల్లభు—జినధర్మ—” (మొదటి పద్యం) అనిన్నీ,

“జినవల్లభు—జితకవి—” (రెండో పద్యం) అనిన్నీ కూర్చబడిన సమాస పదాలు యతికోసం కావేమో? అవి అట్లా పడక తప్పదు. అందువల్ల ఆలంకారికములూ కావచ్చు.

“యా కుందేందు తుషారహార ధవళా
యా శుభ్ర వస్త్రాన్వితా
యా వీణా వరదండ మండిత కరా
యా శ్వేత పద్మాసనా...” ఈ చరణాల్లో యతి యాదృచ్ఛికమూ, ఆలంకారికమూను. అలాగే, “విమలి—విబుధ—” (రెండో పద్యం చివర) సంగతి కూడా యాదృచ్ఛికమేమో ననిపిస్తున్నది. ఎట్లంటే—

ఈ శాసనం లోనివే అయిన సంస్కృత కర్ణాట పద్యాల్లోనూ కొన్ని చరణాల్లో యతిమైత్రి కానవస్తున్నది:

సంస్కృత శ్లోకాలు—

(1) తం। సంపార్యానుజ మత్రి భీమ తనుజం
సమ్యక్త్వ రత్నాకరం.
(1 వృత్తం—4 పాదం.)

(2) చం। వాచావాచయితుం ప్రియాణి సదితుం
సాధ్యాప కర్తుం సతాం.
(2 వృత్తం—2 పాదం.)

(3) భోగాన్సేవితు మంగనా రమయితుం
పూజాం విధాతుం జినే. (2—3 పా.)

కన్నడ పద్యం—

(4) చదుర మయ్యెయ సత్కవిత్వద
సన్న పంపన అమ్మ నొవ్వ...
(తరళ—2 పద్యం—1 పాదం.)

(5) పుదిదు నేర్వడె పేఱ(ళ) ఉర్విగ
పూర్వ మాగిరె బల్లనప్పు దరి...
(2—3 పా.)

మొత్తం 12 చరణాల్లో 5 చరణాలకు యతి మైత్రి కుదిరినదంటే మూడోవంతుకు పైగా సరి పడ్డట్టే! (మొదటచూపిన రెండు యతులు "అనుస్వార సంబంధ—మూపళ్ళ" అర్వాచీనములు గనుక చెల్లవంటే, నాలుగోవంతైనా సరిపడుతుంది గదా!) అయితే ఆ భాషల్లో వళిమైత్రి నియమం లేదుగదా? అట్లాగే ఆనాటి తెలుగుపద్యాల్లో వళినియమం ఐచ్ఛికంగా వుండేదేమో పరిశీలించాలి.

—సులోచన.

## "ఫస్ట్ కేస్"

ఆర్యా,

మార్చినెలలో 'ఫస్ట్ కేస్' కథమీద శ్రీ వక్కలంతం సూరిగారి విమర్శనాత్మకమైన లేఖ చదవడం జరిగింది. వారు తెలిపిన వికార ప్రయోగాలు నేటి సమాజంలో Aristocratic families లో మెలిగేవాళ్ళ — వెయ్యి రూపాయలపైన జీతం తెచ్చుకునే వాళ్ళ భార్యలు, కొడుకులు, కూతుళ్ళ — శ్రీలంక వెళ్ళొచ్చి విదేశాలకి వెళ్లామనుకునేవాళ్ళు— నిజంగా విదేశాలకి వెళ్ళొచ్చినవాళ్ళ — వాళ్ళని మెప్పించా లనుకునే కొందరు సన్నిహితులు—, వీళ్ళంతా స్టైల్‌గావాడే భాషలోని పదాలు. ఆ విధంగా మాట్లాడటం నేటి నాగరికతకి చిహ్నం. ఆ విధంగా మాట్లాడగల వ్యక్తిని Highly civilised గాను, Highly polished గానూ నేటి సమాజం గుర్తిస్తుంది.

ఆ భాషలోని పదాలే బీనాదేవిగారు తమ కథలో వాడుకున్నారు.

వర్తమానమౌతున్న వ్యావహారికభాష అంటూ వర్తమానంలో వాడుకలోవున్న పదాలను రచనల్లో వాడుకోకూడదు అంటున్నారు వక్కలంతం సూరిగారు. వ్యావహారికభాష విషయమై అనర్గళంగా జరిగిన చర్చలకి భారతి వేదికగా లోగడ ఉపయోగపడింది కనుకనే నేడీ నూత్న పరిణామాలకి అవకాశం ఇస్తోంది.

వక్కలంతం సూరిగారు రెండవవైపుకూడా చూసి యథార్థాన్ని గుర్తిస్తారనుకుంటాను.

—భైరవయ్య.

## భాషను గురించి

ఆర్యా,

భారతి జనవరి 1967 సంచికలోని 'ఎన్నికలు - సమస్యలు' అనే వ్యాసానువాద మిటు గ్రాంథిక భాషకాక, అటు వ్యవహారభాషకాక, ప్రతిష్ఠితమైన అనువాద సంప్రదాయాలకు విరుద్ధమైన ప్రయోగాలతో వెగటుగా ఉన్నది. దానిలో అనువాదకుడొకవైపు 'అన్నదే వేర యుండదు. * (1), అభిప్రాయ మొకడు (2), కేంద్ర ఆహారశాఖ యుద్యోగి యొకడు (4), ఉక్కు కర్మాగారము స్థాపనము నిమిత్తము; ప్రభుత్వపు టామ్మలను (5) వారి చెయ్యములకన్నను (6) దేశమునం దింతలు జరుగుచుండగా; భారతదేశము ఇష్టములను; పాకిస్తానము; ఆధారము పడియుండుటవట్ల; పట్టికొన్నదియే కన్పించదు (7)' వంటి కాలం చెల్లిన గ్రాంథికభాష ప్రయోగాలంటే మక్కువ చూపుతూ, తన గొప్పతనమూ, దాని గొప్పతనమూ చాటుతూ, మరోవైపు దానికి విరుద్ధమైన 'వచ్చే ఎన్నికలకు సంబంధించిన; వ్యవహారముగా వుంటున్నది; రాజకీయాల యంతటి; విషయములు వుండవు; ఒక దారియు, తెన్నును లేకుండా నున్నవి. (1), ప్రతిపక్షములు వున్నవి (2), తొలగించడముకూడా (3) గణాంకములు లేకపోవడము; ప్రజ్ఞ యన్నది కొరవడటము; ముందుకు దూకటము; మహానుగుణమును వున్నది. (4) అయితే, తగ్గించబడినది; ఖండించలేకపోవుటయు; రాజధానిలో జరుగకుండా; చెప్పటకు వలను వున్నది. (5), ఒకరిని యొకరు; మారిపోయుటయున్న నయిష్టము (6)'వంటి ప్రయోగాలుచేసి తన సిద్ధాంతాలను తానే మట్టుపెట్టుకున్నాడు.

అనువాదం, ఈ భాషలోని రచన కనువాదమని పట్టియిచ్చేదిగాకాక, మూలభాషలోని పదానికి పదమున్నట్లాకాక, అనువాదభాషా సంప్రదాయాలకు విరుద్ధంకాకుండా, మూలభావాలకు సరిపోయి, తికమకలు లేక చప్పున తెలిసేదిగా ఉండాలి. వారి యీ అనువాదమా మూలం దీనికి విరుద్ధం. ఈ కొన్ని

---

* బ్రాకెట్లలోని అంకెలు పేరా సంఖ్యను తెలుపుతవి.

ప్రయోగాలు చూడండి. 'ఇప్పుడు భారతదేశములో సర్వము రేపు ఫిబ్రవరిలో వచ్చే ఎన్నికలకు సంబంధించిన వ్యవహారముగా వుంటున్నది. (1) దేశమువంక చూచినచో, ఆ దేశము ఎదుర్కొనుచుండిన సమస్యలు, అంతరంగికములు, అంతర్జాతీయములు నయినవి, అతిజటిలముగ నున్నవి. (2), కొన్ని లఘుప్రాంతములయందు పరిస్థితులు ఏవిధముగా రూపము కట్టునో; క్షామప్రాంతములకు మిగులు ధాన్యములను వదలవలయునని కేంద్రము తెచ్చు ఒత్తిడియందు ఈ రాష్ట్రములు పెడముఖము పెట్టుచున్నవి. ఇటు ప్రభుత్వముగాని, పార్టీగాని ఏమి చేయుటకును అసమర్థము లగుచున్నవి. (3) ఇందుకు బహుకారణము లున్నవి. లేక కారణములని చెప్పదగినవి యున్నవి. ఇదియు ప్రధానమంత్రి యొక్క బలము లేనితనమును చూపుచున్నది. (5) విద్యార్థుల యాందోళనము ప్రధానమైన విషయ మగుచున్నది. (6) భారత ప్రభుత్వమునయందు ఈ అధారము పడియుండుట పట్ల వైమనస్యమున్నది. 'మిస్ వరల్డ్' ఉదంతమున్నదనగా నచ్చట భారత ఉద్యోగి బృందము నడచిన నడక ప్రహసనము మాదిరిగా నున్నది (7).'

'వాయిదా పడునట్లు (3), సంబాళించు (5), ఫలానా, అటకాయింపు (6), షరతులు (7)' వంటి పరభాష పదాలను అంతటి పదాలు మన భాషలో లేనట్లు వాడారు.

ఇదే సంచికలో వీరివలెనే 'రాధామాధవము' అనే విమర్శ వ్యాసాన్ని, రచయిత అభిమానించి గ్రాంథిక భాషలో వ్రాసినా, వారికీ పైపాట్లు తప్పలేదు. గ్రాంథికభాషా విరుద్ధమైన వారి యీ ప్రయోగాలు చూడండి.''అన్నది హృదయాన్ని; కావ్యరసాన్ని; ఆంధ్రీకరించగా; కంబరామాయణమూ; ఎంతయినకానీ కొంత వరకుమా; వీటినే; అనేకమంది; తెలుసుకొను(1), ఇంకా; పొగడుతూ; పొగడుచూ (2), ప్రశంస నందుకొన్న కొనభాగము (4) మెచ్చుకోదగినది; పుట్టించుచూ ధ్వనిసంజ్ఞయూ; తనయందు యిమిడ్చుకొన్న (5) సంగీతమట్టును; చెదరనివ్వక; ఇంగ్లీషులోకి; ఎంత మాత్రమూ; భంగము రానివ్వక; మార్చుకున్నారు, క్రైస్తవాలయాలలో; తెలుసుకొని; ఒప్పిరి. (6) తర్జుమా చేసుకోవచ్చును, పురందరదాసుల పదాలు యథాతథంగానే, తర్జుమాలకు తావివ్వవు; గొప్ప శ్రేణినే అందుకొన్నది (7,''

'తర్జుమా' అన్న పరభాషా పదాన్ని దానికి సాటి తెలుగు పదాలను వాడుతూనే, వ్యాసమంతటా పదిసార్లయినా ప్రయోగించారు. సబబు, రోజాలు వారు వాడిన వేరే పరభాషా పదాలు.

మనం భాషించేది భాష. దానికి మరో రూపం లిఖిత భాష. భాషకు ప్రయోజనం భావాలను ఎదుటి వారికి అశ్రమంగా తెలిసే అట్లందించడం. వాగ్రూపభాషకు లిఖితభాష ఎంతదగ్గరగా ఉండగలిగితే అంత ఆ ప్రయోజనం చక్కగా నెరవేరుతుంది. దానికదెంత దూరంగా ఉంటే అంత ఆ ప్రయోజనం దెబ్బతింటుంది. భావాలు చక్కగా అర్థం కాకుండా కానీ; కష్టంగా అర్థమయ్యేవిగా కానీ ఉంటే ఆ భాషను శ్రోతలెంత మన్నిస్తారో దానికి లిఖిత రూపాన్నిస్తే చదువరులూ అంతే మన్నిస్తారు. ఐనా కొందరు పిచ్చిపట్టుదలతో యీ ప్రజాస్వామ్య కాలంలోనూ, పాతకాలంలో ఒక్క వర్గం తన ప్రయోజనాలకోసం సృష్టించి పెంపు చేసుకున్న గ్రాంథిక భాషకు పాదసేవలు చేస్తుండడం సంఘ ద్రోహమే ఔతుంది.

''అచల్''

## కుమార సంభవము

(మహాకవి కాళిదాస కృతికి ఆంధ్రీకృతి: కర్త: పొన్నలగడ్డ మృత్యుంజయరావు ఎం.ఏ., వెల: 2—50; ప్రాప్తిస్థానము: శ్రీమతి జె. శకుంతల, భారతీ నికేతనము, 6—3—1 ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము—2)

పార్వతీ పరిణయాంతమయిన కుమార సంభవమను నీ యాంధ్రకావ్యము, కాళిదాస కుమారసంభవమునకు యథామూలానువాదము. సంస్కృతమునందు పదునేడు సర్గలతో కూడిన కుమారసంభవ కావ్యము కలదు. ఆ పదునేడు సర్గల కావ్యమును కాళిదాసు రచించెనా? యను నదొక ముడి విడని చిక్కు. విమర్శకులు తలలు బద్దలు కొట్టుకొనిరి. రచనా భేదమునుబట్టి పదినేడు సర్గల కావ్యమును కాళిదాసు రచింపలేదని తీర్పునిచ్చిరి. మఱి కాళిదాసెన్ని సర్గలు రచించెను? ఏడు సర్గలు మాత్రమే రచించెనని శుద్ధబుద్ధులు కొందఱు వక్కాణించిరి. కాని యీ సిద్ధాంతమునకు రెండు ప్రతిబంధకము లున్నవి. కుమారసంభవము నందలి యెనిమిదవ సర్గకు ఉమాసురతవర్ణన మని పేరు. ఆ సర్గలో జగత్తునకు తల్లిదండ్రులయిన పార్వతీ పరమేశ్వరుల సంభోగవర్ణనము లెస్సగా కలదు. ఈ సర్గను కాళిదాసు రచించియుండడని ఆస్తిక శిరోమణులు, పవిత్ర హృదయులు భావించిరి. ఆ భావన కేవల భావనయైనది. మల్లినాథసూరి ఆ యష్టమ సర్గమును సైతము కాళిదాసకృతముగనే యెంచెను. వ్యాఖ్య వ్రాసెను. దీనికితోడు ఆనందవర్ధనాచార్యుల వారు ధ్వన్యాలోకములో చెప్పిన మాటలు కలవు. ఆయన అవ్యుత్పత్తికృతదోషము సైతము కవుల శక్తిచే మఱుగువడునని చెప్పిరి. చెప్పి 'యథా కుమారసమ్భవే దేవీసమ్భోగవర్ణనమ్' అని యనిరి. ఉమాసురతవర్ణనమే దేవీసంభోగవర్ణనము గదా! ఆనందవర్ధనుడు ఆ యష్టమ సర్గమును గూడ కాళిదాసు రచించెనని యంగీకరించెను. మల్లినాథుడు వ్యాఖ్యానించెను. ఇందు పూర్వపక్షములకు ఏ మాత్ర మవకాశము లేదు. ఎనిమిది సర్గల కుమారసంభవమును కాళిదాసే రచించెనని నేడందఱు నంగీకరింతురు. అంగీకరింపక యేమి చేయుదురు? మృత్యుంజయరావుగారు మాత్రము ఎనిమిదవ సర్గను వదలివేసి, యుమాప్రసాదాంతమయిన కుమారసంభవమును తెనుగునకు దింపిరి.

రఘువంశమునకు వ్యాఖ్యానము వ్రాయుటకు గంటము పట్టిన మల్లినాథసూరికి మొదటనే తన శక్తియుక్తులెంతలు? అను ననుమానము రానే వచ్చెను. అసలు రఘువంశమును రచించుటకుముందు కాళిదాసే స్వశక్తిహీనతను ధీరవినయముగా చాటెను. అట్లే మల్లినాథసూరియు 'కాళిదాసుని వాక్సారము కాళిదాసునకుగాని సరస్వతీదేవికిగాని చతుర్ముఖునకుగాని తెలియును. నా వంటివారు తెలిసికొన జాలరు.' అని మల్లినాథుడు చెప్పెను. అయినను నాటికి నేటికి ఆయనయే వ్యాఖ్యాతృ శిరోమణి యాయెను. కుమారసంభవమును తెనుగుచేయుటకు పూనుకొనిన మృత్యుంజయరావుగారికికూడ మల్లినాథునకు వచ్చిన యనుమానమే వచ్చినది. వచ్చి, రఘువంశ ప్రారంభమున కాళిదాసు చెప్పుకొన్నట్లుగా తామును చెప్పుకొనిరి. ఊఱట పొందిరి.

'అమోఘము, దివ్యమునైన శక్తి' యేదో పురికొల్పగా రావుగారీ కుమారసంభవావతారమునకు కంకణము కట్టుకొనిరి. 'పద్యము సెల్లు నేర్పెడు బంగరువు' వారి కడ నున్నదట! భావమణులు కావలయునట! కాళిదాసకావ్యఖనిలో ఆ భావమణులు సమృద్ధిగా పడయవచ్చునని, ఆంధ్రకుమారసంభవ రచనమునకు శ్రీకారము చుట్టిరట! భగీరథుడు విష్ణుపాదములందు ప్రభవించిన గంగానదిని భూమికి తెచ్చినట్లు తాము కాళిదాసు రచించిన కుమారసంభవమును తెలుగుబాసలో వెలయింతుమని మృత్యుంజయరావుగారు చెప్పుకొనిరి. మంచిదే గదా!

కాళిదాసు కావ్యమును తెనుగుచేయుట సామాన్య కార్యమా? కాదని యీ కవికి తెలియును. అవతారికయే సాక్ష్యము. వ్యంగ్యవైభవము క్రిక్కిఱిసియున్న కాళిదాసు వాక్కులను తెలుగునకు దెచ్చుట యంతంతమాత్రమున నగుపనికాదు. సంస్కృతభాషా సంప్రదాయములు వేఱు. తెలుగుబాస కట్టుబాటులు వేఱు. యతిప్రాసలను కఠోర నియమము లీభాషలో కలవు. మూల కావ్యమునందలి భావములకు లోపము రానీయడు. అనువాదకుడు అధికముగా నేమియు అతికింపగాదు. తెనుగు నుడికారమును, ఆంధ్రకారకమును పోషింపవలయును. ఇన్ని యిక్కట్టులుండుట చేతనే యీ యనువాదయిత 'స్వీయమే యనువాదంబుకంటె నెంతొ సుకరంబౌఁగాదె యాంధ్రంబునన్' అని యనుకొనిరి. అమోఘము దివ్యము నైన శక్తిచే పురికొల్పబడిన రావుగారిట్లనుకొనుట కాళిదాస కవితామహిమకు తార్కాణముగా నున్నది. నన్నిచోడదేవుని నాటినుండి యీ నాటివఱకు కుమారసంభవమును ఎందఱో యాంధ్రీకరించిరి గదా! మఱి యీ నూతనానువాదమేటికి? రావుగారికీ శంకయు కలిగినది. ఆంధ్రకవులెందఱో తమ కావ్యపుష్పములచే సరస్వతీదేవి నలంకరించిరనియు, అయిననప్పటికి తాను మఱియొక కావ్యకుసుమమును ఆ శారదాదేవి కొప్పున దుఱిమినచో అమె సొగసు హెచ్చునేకాని, తఱుగదనియు మృత్యుంజయరావుగారు ఆత్మవిశ్వాసముతో పలికిరి.

సంస్కృత సాహిత్యానువాదము నన్నయ కాలమునుండియు చెల్లుచునే యున్నది. యథామూలానువాదము చేయుట ప్రాచీన కాలమున ప్రచురమయిన పద్ధతిగాదు. మూలమును యథాతథముగా తెలుగునకు దింపవలయునని నెనుకటి కవులనుకొనలేదు. అట్టి యభిరుచి నవీనకాలమునందే ప్రసిద్ధికి వచ్చినది. కవిత్రయ భారతమునే తీసికొనుడు. అది యథామాతృకానువాదము గాదు. మూలమున కెన్నో చేర్పులు మార్పులు కలిగినవి. 'కావ్యానువాదముతో ఆంధ్రసాహిత్య ప్రపంచమును మఱొక వైపునకు మరలించినవాడు శ్రీనాథుడుగదా! అయిన నైషధాంధ్రీకరణము భారతాంధ్రీకరణము వంటిదిగాదు. శృంగార నైషధాంతమున శ్రీనాథుడు తన యనువాద ప్రణాళికను చూపెను. మూలశ్లోకముల సమాసములను ఉన్నవి యున్నట్లుగా స్వీకరించియు, మూల భావములకు సమానములయిన నూతన భావములను జత చేసియు, మూల శ్లోకములలో అనౌచిత్య మున్నచో పరిహరించియు, చిఱుమార్పులలో మూలశ్లోకములను మెఱుగులు దిద్దియు, యింకను అనేక రీతులుగా శ్రీనాథుడు నైషధము ననువదించెను. తరువాతి తరువాతి యనువాద కవులకు భారత శృంగార నైషధానువాదములు ఒరవడులయినవి.

కుమారసంభవ విషయమే చూచికొన్నచో ప్రాచీనకాలమున కాళిదాస కుమారసంభవము ననుసరించిన కవులిద్దఱు. ఒకడు నన్నిచోడదేవుడు. రెండవవాడు శ్రీనాథుడు. నన్నిచోడదేవుడు కుమారసంభవమును లోకోత్తర ప్రబంధమును రచించెను. ఇక శ్రీనాథుడు హరవిలాసమునందు తృతీయ చతుర్థాశ్వాసములలో కుమారసంభవగాథను వర్ణించెను. వీరిలో నెవ్వరును కాళిదాస కుమారసంభవమునకు యథామూలానువాదము చేసినవారుగారు. ఆ కవుల లక్ష్యమదిగాదు. నన్నిచోడదేవుడు కథాసంవాదమున్న చోటులనెల్ల కాళిదాసుని శ్లోకములను, ఉద్భటుని శ్లోకములను స్వీకరించెను. స్వీకరించుటయేగాదు, మూల శ్లోకముల భావములతో నొక కొన్ని నూతన భావములను జేర్చి పెంచెను. కాళిదాసొక యుపమాలంకారము వాడినచో, నన్నిచోడదేవుడు చాలదని యేమో యింకను నాలుగిటిని చేర్చును. చూడగా, చూడగా శ్లోకానువాదములో శ్రీనాథుడు పోయిన పోకడలకు, నన్నిచోడదేవుడు మొదలు త్రోవ చూపినవాడుగా కన్పట్టుచున్నాడు. ఇక శ్రీనాథుడు కాళిదాసు నెట్లనుసరించెనందురా? కాళిదాసునకున్న సంయమనము శ్రీనాథునకు శూన్యము. దర్పాటోపములు గల శ్రీనాథుని రచనములో కాళిదాసుని వ్యంగ్యమునకు చోటెట్లుండును? హరవిలాసము ఆదర బాదరగా రచించిన కావ్యమని సూక్ష్మవిచారము చేయగలవారికి తేటతెల్లమగును. అదియునుగాక నైషధమును తెనుఁగు చేయుచు, రాజకీయ కారణములవలన నడుమ దానిని విరమించి, శ్రీనాథుడు హరవిలాస రచనమున కుద్యమించెనని విమర్శకు లొకరూహించిరి. ఇది నిజమయినచో హరవిలాసములో కాళిదాస శ్లోకములు

అస్తవ్యస్తముగా అవతరించుటకు కారణము లున్నట్లగును. శ్రీనాథుని చేతిలో కాళిదాసుని శ్లోకము లెట్టి యవతారమెత్తినవో వేటూరి ప్రభాకరశాస్త్రి గారు వివరించిరి.

మృత్యుంజయరావుగారి యనువాదము విలక్షణమయినట్టిది. వారు కాళిదాసుని యష్టమసర్గము ననువదింపరైరి. అది యపవిత్ర కార్యమనుకొన్నారేమో తెలియదు. దానిని గూడ ననువదించియున్నచో, కాళిదాసు కావ్యమంతయు యథారూపముగా తెలుగు వారి కందియుండెడిది. ఈ కాలమున కుమార సంభవమును వచనముగా ననువదించినవారా యష్టమ సర్గమును వదలరైరి. అభిరుచి భేద మనుకొందము గాక! మృత్యుంజయరావుగారు ఒక్కొక్క శ్లోకమునకు ఒక్కొక్కపద్యము చొప్పున అనువాదము చేసిరి. ఆ పద్యములు వృత్తములు, జాత్యుపజాతులు. సీసపద్యమును విడిరి. కాళిదాసు రతివిలాపమును వియోగినీ వృత్తమున వర్ణించెను. రావుగారా సంప్రదాయమును వదలక రతివిలాపమువట్ల వియోగినీ వృత్తమును స్వీకరించిరి. అంతేకాదు. ఒండు రెండు చోట్ల, వర్ణనములు మూలమున నేవిభక్త్యంతములై యున్నవో, అనువాదమునందును ఆ విభక్త్యంతములై యున్నవి. మూలమున సమాధి స్థితుడగు శివుని వర్ణనము ద్వితీయావిభక్తియుతమై సాగినది. అట్లు సాగిన శ్లోకములారు. పరమేశ్వరుని కడకు వచ్చిన సప్తర్షి వర్ణనము ప్రథమా బహువచనముతో కూడినది. అట్టి శ్లోకములారు. అనువాదపద్యము లీ రెండు సందర్భములందును ద్వితీయా ప్రథమా బహువచనములతో కూడియే యున్నవి.. ఆంధ్ర కుమార సంభవమంతయు కాళిదాస కుమారసంభవమునకు మక్కికి మక్కిగానున్న యనువాదము. ఈ విషయము రావుగారికి తెలియును. అందుచేతనే కాబోలు వారు కాళిదాసు నుద్దేశించి యిట్లు పలికిరి. 'మహాకవీ! మతిమంతులు కొందఱు మక్కికి మక్కిగా అనువాదము చేసితినని వెక్కిరింపనిమ్ము. నీ కవితలో ఒక యక్షరమేనియు మార్చుటకు శక్యముగాదు. నేనెక్కడ దానిని మార్చువాడను? అట్లు మార్చుట యెవ్వరి తరము గును? అది రుచించునా? క్షారముచేర్చి (ఈ క్షార శబ్దమునకు బూడిద, బెల్లము, కారము, యవక్షారము మున్నగు ననేకార్థములు కలవు) యెవ్వరైన పాయసమును విరసము చేయుదురా?' కాళిదాసుని కవితలో నొక యక్షరము సైతము మార్చుటకు వీలుగాదని భావించినవారు కనుకనే వారి యనువాద కార్యము తేలికగా నయినది. దాని తీరు తెన్ను లెట్లుండెనో పరిశీలింపవలయును.

మూల శ్లోకముల యనువాదము రెండు మూడు రీతులుగా నున్నది. కాళిదాసు శ్లోకములలో నున్న సమాసములను యథాతథముగా అనువాదమునం దుపయోగించికొనుట యొక పద్ధతి. శ్రీనాథుడే యీ తీరుగా చేసెనని మొదటనే విన్నవించితిని. రావుగారా పద్ధతిని పునరుద్ధరించిరి. ఉదాహరణములు చూడుడు. రాత్రివేళల వనితలతో కూడియున్న కిరాతులకు తృణజ్యోతిస్సులే సురత ప్రదీపములగుచున్నవని కాళిదాసు వర్ణించెను. ఆ తృణజ్యోతిస్సుల విశేషణము 'దరీగృహోత్సంగ నిషక్తభాసః' అనునది. అదే తెలుగులో 'దరీగృహోత్సంగ నిషక్తభాసములు' అయినది. 'వనేచరాణాం' అనునది 'వనేచరులు' గను, 'అతైలపూరాః' అనునది 'అతైలపూరతన్' అనియును భావము ప్రకటించురీతి నిట్టె మారినవి. 'దరీగృహద్వారవిలంబి బింబాః' అనునది అనువాదములో 'దరీగృహ ద్వారవిలంబి బింబములు' గా నయినది. 'అరణ్య బీజాంజలి దానలాలితాః' అని మూలము. 'అరణ్యబీజాంజలిదానలాలితములై' యని యనువాదము. 'ప్రభిన్నదిగ్వారణవాహనః' అనునది 'ప్రభిన్న దిగ్వారణ వాహనుండు' అయినది. 'విచిత్ర మందార రజోఽరుణాంగుళీ' అనునది 'విచిత్ర మందార రజోఽరుణాంగుళి' యయినది. 'ఊర్ణామయం కౌతుకహస్తసూత్రమ్' అనునది 'కౌతుకహస్త సూత్ర మూర్ణామయ'మయినది. ఆద్యంత మిట్టి యుదాహరణము లెన్నియయినను గలవు.

మూలసమాసమునందు అనేక పదము లుండును గదా! అట్టిచో గణాదినియమములవలన, ఆ యనేక పదములలో నొక కొన్నిటికి పర్యాయపదములను జేర్చి యనువాదము చేయుట రెండవ పద్ధతి. 'తుషార స్రుతిధౌతరక్తం' అని మాతృకయందుండగా అనువాదములో 'తుషార సంహతి స్రుతి పరిధౌత రక్తము' అని

యైనది. కాళిదాసు మైనాకుని 'అంభోనిధి బద్ధ సౌఖ్యం' 'నాగవధూపభోగ్యం' అని వర్ణించెను. తెలుగుసేతలో వీరు మైనాకుని 'అంబుధిబద్ధ సౌహార్దు'నిగను, 'నాగకన్యోపభోగ్యు'ని గను చేసిరి. 'లలితయోషిద్భ్రూలతా చారుశృంగం' 'రతివలయ పదాంకే' అని మూలము. అనువాదములో 'లలితకాంతా భ్రూలతా చారుశృంగము' 'నిజప్రియావలయరేఖా చిహ్నితంబు' అని యున్నవి. 'బ్రహ్మాంగభూః బ్రహ్మణి యోజితాత్మా' అని మూలమునందుండగా 'బ్రహ్మాంగ వాస్తవు, బ్రహ్మప్రయుతాత్ముఁడు' అని యనువాదమున సిద్ధించినది. 'శైలగురూపనీతం' అనునది 'అద్రిగురూపనీతమున్' అనియును 'తదీషదార్ద్రారుణ గండలేఖం' అనునది 'కించిదార్ద్రారుణగండరేఖము' అని యును రూపొందినవి.

సంస్కృత గ్రంథములను తెలిగించునపుడు, ఆ గ్రంథముల వ్యాఖ్యానములను గూడ ప్రధానముగా భావించి, వాని యందలి భావములను అనువాదముల కెక్కించు ఆచారము ఈ నాటిది గాదు. మూలమునందలి ముడులను వ్యాఖ్యానములు విప్పి తేటతెల్లము చేయును. పోతన మున్నగువారి యనువాదములీ కోవకు చెందినవే. మృత్యుంజయ రావుగారు మల్లినాథసూరి వ్యాఖ్యానమును అనుపదమున నవలోకించినట్లు వారి గ్రంథమే చెప్పుచున్నది. అవలోకించుటయేకాక, వారు వ్యాఖ్యానమునందలి సమాసములను యథాతథముగా పద్యములలో పొదిగిరి. చూడుడు. పార్వతీ జంఘావర్ణనమున కాళిదాసు 'వృత్తానుపూర్వే' యని యనగా మల్లినాథుడు 'వృత్తే వర్తులే—పూర్వమనుగతే ఒను పూర్వే—గోపుచ్ఛాకార ఇత్యర్థః' యని వ్యాఖ్యానించెను. రావుగారు 'వర్తులములై యాఁదోఁకలై' యని యనువదించిరి. 'గోపుచ్ఛాకారము' 'ఆఁదోఁకలై' యయినది. సతీదేవి మరణానంతరము శివుడు స్త్రీని పెండ్లియాడలేదు. కాళిదాసు 'పతిః పశూనా మపరిగ్రహోఽభూత్' అని వర్ణించెను. 'అపరిగ్రహః' అను దానిని వ్యాఖ్యానించుచు మల్లినాథుడు 'అపరిగ్రహోఽపత్నీకోఽభూత్—స్త్ర్యన్తరం న పరిజగ్రాహేత్యర్థః' అని స్పష్టము చేసెను. రావుగారు 'ముక్కంటి యింకొక యతివ నెవతెఁ బెండ్లియాడకుండె'నని యనువదించిరి. ఇది 'స్త్ర్యన్తరం న పరిజగ్రాహ' అను దాని స్వచ్ఛరూపముగదా! 'హిమక్లిష్టప్రకాశాని' యనునది కాళిదాసు మాట. 'హిమేన నీహారేణ—క్లిష్టప్రకాశాని మందప్రభాణి' యనునది మల్లినాథుని బాట. 'మందప్రభలన్' అని అనువాదము. ఇది వ్యాఖ్యాతృ సమాసమే కదా! 'పర్యంకబంధస్థిర పూర్వకాయమ్' అని మూలము. 'పర్యంకబంధేన వీరాసనేన' యని వ్యాఖ్యానము. 'వీరాసన స్థిర పూర్వకాయమున్' అని యనువాదము. 'సంతానకాకీర్ణ మహాపథం తచ్చీనాంశుకైః కల్పితకేతుమాలమ్' అని కాళిదాసు. 'చీనాంశుకైః పట్టవస్త్రైః' అని మల్లినాథుడు. 'పట్టవస్త్ర కల్పితకేతు పంక్తికమ్ము' అని రావుగారు. వ్యాఖ్యయందలి పట్టవస్త్రములు పద్యమున వచ్చి నిలిచినవి. ఇంకను ఉదాహరణము లున్నవి.

ఈ విధముగా మల్లినాథుని అనుసరించిన రావుగారే కొన్నిచోట్ల వ్యాఖ్యానమును చూచియో, చూడకయో అనువాదము చేసిరి. అందుచేతనే యీ సందర్భములు స్పష్టత కోరుచున్నవి. శ్లోకభావమును

వ్యాఖ్యానము కరతలామలకము చేయగా, అనువాదము అస్పష్టము చేయుచున్నది. రతిదేవి తన మగనిని అచ్చరలు వలలో వేసికొందురను తలపుతో తానును వెంటనే యగ్నిప్రవేశము చేసి దరిజేరుదునని మన్మథు నుద్దేశించి వాపోయినది. ఈ సందర్భమున కాళిదాసు 'పతంగ వర్త్మనా' యని వాడెను. మల్లినాథుడు 'పతంగ వర్త్మనా శలభమార్గేణ అగ్నిప్రవేశేనేత్యర్థః' అని వ్యాఖ్యానించెను. రావుగారు 'పతంగ పద్ధతిన్' అని యన్నారు. ఇది మూలమునకు గుత్తముగా సరిపోవునేమోకాని, స్పష్టార్థము నీదు. కుసుమాయుధ పత్ని 'తదిదం క్రియతామనంతరం భవతా బన్ధుజన ప్రయోజనమ్' అని వసంతుని గోరినది. 'బంధుజన ప్రయోజనం బంధుకృత్యం' అని వ్యాఖ్యలో కలదు. చనిపోయినవారిని చితిజేర్చి నిప్పు ముట్టించుట బంధుకృత్యము గదా! అనువాదము 'తుది కార్యము' అని చెప్పుచున్నది. బంధుకృత్యము తుదికార్యమగునా? సప్తర్షులు మూడు రోజులకు పిదప వివాహలగ్నము పెట్టి, శివున కెఱింగించి వెళ్లిపోయిరి. మదనాంతకు డెట్లో ఆ మూడు రోజులు గడపెను. అప్పుడు కాళిదాసు 'కమపరమవశం న విప్రకుర్యు ర్విభుమపి తం యదమీ స్పృశన్తి భావాః' అని చెప్పి షష్ఠ సర్గమునకు స్వస్తి చెప్పెను. ఈ భావములు పరమేశ్వరునే యేడాటలాడింపగా, యితరుల మాట చెప్పనేల? యని యీ శ్లోకోత్తరార్థమునకు తాత్పర్యము. 'అమీభావాః' అన్నపుడు అర్థము సుగమము గాదు. 'అమీభావ ఔత్సుక్యాదయః' అని వ్యాఖ్య గలదు. అనువాదములో 'సర్వసమర్థుడై యొసఁగు శర్వునె భావము లివ్వి తాకఁగా'నని యున్నది. 'భావము లివ్వి' యనగా నేమి ?

కాళిదాసు గీసిన గీటు దాటకూడదను కట్టుబాటుచే మృత్యుంజయరావుగారు పై రీతిగా తెనుగు చేసిరా? అదియును కానంబడదు. వృత్తములను స్వీకరించినపుడు, ఇతర స్థలములలో వారు మూలశ్లోకములను, దండిగా మాటలు కొట్టిపోసి అనువదించిరి. మూలశ్లోకమునందొక చిన్నమాట యున్నచో, అది చాలదని దానికి బదులుగా వ్యాఖ్యానము చేయుచున్నట్లుగా పెక్కుమాటలు వాడిరి. మూలమునందలి యర్థవంతములగు పదములను త్యజించిరి. 'నీదుకైతనే నెక్కడ మార్చువాఁడ'నన్న రావుగారేనా? యీ యనువాదము చేయుచున్నది యను నాశ్చర్యము పాఠకులకు కల్గును. అక్కటకు అని పెంపువలన ఇంపు కలుగదు గదా! 'దుర్వహ శ్రోణి పయోధరార్తా' యని మూలము. 'దుర్వహ స్ఫీతకటీపయోధర విశేష భరమ్మున నుమ్మలించుచున్' అని యనువాదము. ఇంత సమాసము చేసినగాని శ్రోణి పయోధరముల బలిమి తెలియదా యేమి? 'చంద్రమరీచిగౌరైః' అనునది యనువాదములో 'సరసిజవైరి శుభ్రకర సంచయ గౌరవములై' యని యనువంతవఱకు బోయినదిగదా! ప్రథమ సర్గము 41వ శ్లోకములో 'పరాజితేనాపి' 'మకరధ్వజేన' అను రెండు మాటలు గలవు. అవి తెలుగులో 'స్మరుండు సునాస్త్రజాలము వృషధ్వజుపై గురిచూచి యేసితాఁ బురహరుచేత నోడియును బార్వము' అనునంతదాక తెగ పెరిగినవి. తృతీయ సర్గమున కాళిదాసు అకాలవసంతావిర్భావ ఫలితములను మనోహరముగా వర్ణించెను. లతాంగులను వర్ణించునప్పుడు 'పర్యాప్తపుష్పస్తనాభ్యః స్ఫురత్ ప్రవాళోష్ఠ మనోహరాభ్యః' అని కాళిదాసు వర్ణించెను. అనువాదకులు 'ప్రసవగుచ్ఛకుచము, ప్రస్ఫురత్కిసలోష్ఠము' అని మాత్రమే తెలిగించిరి. 'పర్యాప్త' 'మనోహర' పదములను వీడిరి. అర్థవంతములగు వానిని వీడుట యేల? వానిని వీడినచో లతాలలనల పూర్ణయౌవనము, సౌందర్యము తెలియునా? ఆంధ్రకావ్యమునందు పార్వతిని తెలియజేయు స్త్రీ పర్యాయ పదములు ఎన్నో కలవు. అవి మాతృకలో లేవు. షష్ఠసర్గములో ముప్పది యారవ శ్లోకమునందు పరమర్షులు ఓషధిప్రస్థమునకు వెళ్లిరన్నంతవఱకే మూలమున కలదు. ఓషధిప్రస్థమున కే విశేషణము లేదు. రావుగారు 'తుహినమహీధరాధిరాజపురమున కోషధిప్రస్థమునకు' అని యొక విశేషణము చేర్చిరి. కాళిదాసు ఏ విశేషణము చేర్చకపోవుట మహర్షులకు ఆ నగరము చిరపరిచితమని వ్యంగ్యముగా నిరూపించుటకే. అనువాదమందా శోభలేదు. సప్తమసర్గమునందలి యరువది యొనిమిదవ పద్యము అనువాదమున నెంతో పొడుగుపెరిగినది. పద్యము మత్తేభముగదా! ఇంతేకాదు. మూలము

వందలి సమాసములు కఠినపదములతో కూర్చినవి గావు. ఆ సమాసగత పదములు సరళములు. మనోహరములు. కాని యీ సమాసములే తెలుగున ప్రౌఢత లోపించిన క్లిష్టసమాసము లయినవి. 'రజనీ తిమిరావగుంఠితే పురమార్గే' యని మూలము. 'క్షణదాంధము గ్రమ్మ వీథులన్' అని యనువాదము. మూలమునందలి 'సుజాతోత్పలపత్రములు' అనువాదమున 'సమ్యగుద్భూత కువేంసత్రము' లయినవి. 'కనకకలశ యుక్త' మనునది 'కర్పూరమయ పూర్ణ కుంభయుత' మయినది. 'పుష్పాసవా ఘూర్ణితనేత్ర శోభి' యనునది 'బంధురగంధ మధుద్రుమ ప్రసూనాసవపానఘూర్ణిత దృగంబుజ శోభితమున్' అని వామనుని మాదిరిగా పెరిగినది.

ఈ కావ్యమునకు పీఠిక వ్రాసిన విద్వచ్ఛిరోమణి యొకరు కాళిదాసు శ్లోకముల ననువదించువేళల శ్రీనాథుడు పద్యరచనా సౌందర్యముమీద మాత్రమే చూపు సారించెననియు, మూల శ్లోక సౌందర్యమును అనువాదమునందు వెలయింపలేదనియు ననిరి. ఈ యాంధ్రానువాదము శ్రీనాథుని పోకడకు వ్యతిరేకముగా నున్నది. మృత్యుంజయరావుగారు మూలశ్లోక భావము వచ్చినదా ? రాలేదా ? యని చూచిరే కాని అనువాదము సౌష్ఠవసంతనల జోలికి పోలేదు. ఫలము రచనలో పడలింపు సాక్షాత్కరించినది. వృత్తములు వాడినచోట అనువాదము పేలవమై బిగివిగి కోల్పోయినది. తెనుగుబాసకు సహజముగాని దూరాన్వయము దొరలినది. 'ఉద్గాస్యతాం—కిన్నరాణాం' అనుదానికి 'ఉచ్చకంఠమున గానము సేపెడునట్టి కిన్నరవ్రతతికి' అని యనువాదము. 'అధోరుదేశాదవతార్య పాద, మాక్రాన్తి సంభావిత పీఠమ్' అని మూలము. '......బిలమూదనుఁ డాత్మ పదాబ్జ మూరుదేశము నయిఁ బెట్టుకొన్నది వెసన్ బదపీఠిఁ దదర్హణార్హమౌ క్రమమున నిల్పి...' అని తెనిగింపు 'తస్మిన్ సనే సంయమినాం మునీనాం తపస్సమాథేః ప్రతికూలవర్తీ' అనుపాదములను తెనిగించునపుడు మూలపదముల క్రమము తప్పక 'అమ్మ్రుదుండు సవ్వనమునందలి సంయమివాంఛితరిసంఘముమ్మ తపస్సమాధికి విఘాతకరుండు' అని రావుగారనిరి. సప్తమ సర్గమునందలి అరువది రెండవ శ్లోకము 'తాసాం ముఖైరాసవగంధగర్భైః' అను నది మనోహర మయినట్టిది. అనువాద మెట్లున్నదో చూడుడు. 'ఎంతయు వేడ్క విహారిఁ బరమేశ్వరు చూచుచున్న తత్పురీకాంతల, హృద్యగంధ మధుగర్భములై, సవిలాస పంచలత్కాంతవిలోకవాలు లయి క్రాలు మొగమ్ముల....' 'కాంతల' 'మొగమ్ముల' నడుమ మూడు విశేషణము లుంటచే అన్వయము దూరము గుటయేకాక కూర్పులో బిగింపు తక్కువ కాలేదా? పంచమసర్గమునందలి పదునొకండవ శ్లోకమునకు 'వారిజపత్రనేత్ర' యను పద్యము అనువాదము. ఈ పద్యము నర్థము చేసికొనుటకు పాఠకుడు మూలశ్లోకముకడకే పోవలసియున్నది.

ఆంధ్రకుమారసంభవ మందలి పదముల కూర్పుకూడ విచిత్రముగనే యున్నది. విశేషణ విశేష్యములకు నొకే విభక్తిని అతికించుట సంస్కృతభాషా సంప్రదాయము. ఆ పద్ధతి సందర్భమునుబట్టి ప్రౌఢముగా సుందరముగా నుండును. రావుగారి యనువాదమునందీ యేకవిభక్తి సంయోజనము సమృద్ధిగా నున్నది. అది కొన్నిచోట్ల రమ్యము. పెక్కుచోట్ల వికృతము. 'వినాకు యుగదీర్ఘబాహువులకు, 'ప్రతిఘాతోద్గతభాసము దితిజారి సుదర్శనమ్ము' 'విమున్ మత్సమున్' 'గత దేహముఁ గాంచి కాంతమున్' 'జడలను గలమౌగపింగళముల, "దివిషత్ప్రకరమ్మునా సమస్తమును' 'వారిన్ చీర వసనులన్' మున్నగు చోట్ల సొగసున్నదా? అట్లే 'దరీగృహద్వారవిలంబి బింబములు వారి ధరాలు' 'తత్రరవముం దించి పదాలు మాటికి' 'ప్రసవాలు శరాలు' అనుచోట్ల శ్రుతి కటుత్వము కలదు. 'లు—ల—న—లు పరంబగునవు డొకానొకచో' అను సూత్రమ్ముక్రింద 'ఒకానొకచోట ననుటచే నీ కార్యంబునకుఁ బ్రయోగ వైరళ్యంబు సూచింపఁబడియె' నని చిన్నయసూరి చెప్పనే చెప్పెను. విశేషణముల షష్ఠికి ప్రథమ కల్గిన ప్రయోగములు కూడ పెక్కుపగనే యున్నవి. 'మున్ముదొకొండ పురోధసుండు' అనుట విన సొంపుగా నున్నదా?

మృత్యుంజయరావుగారి పరిశీలమున కందినవో లేవో తెలియదుగాని, అనువాదము సందొక కొన్ని

నెఱను అనౌచిత్యములవంటివి లేకపోలేదు. పార్వతీదేవి కటిప్రదేశమును వర్ణించుచు కాళిదాసు, అనన్యనారీ సాధ్యముగాని పరమేశ్వరుని యంకమును తపశ్చర్యానంతరము పొందగలిగెను గావుననే, ఆ కటి యిట్టి దట్టిదని చెప్ప నర్హము గానిదని వచించెను. పరమేశ్వరుని యంక మెట్టిది? 'అనన్యనారీ కమనీయమ్ అంకమ్' అని కాళిదాసు చెప్పెను. అనువాదములో 'అనన్యసతీ కమనీయుమౌ' యని కలదు. కాళిదాసు కేవల నారీశబ్దము నుపయోగింపగా, రావుగారు సతీ శబ్దమును వాడిరి. ఇట సతీశబ్దమును వాడుట యుచితముగా నున్నదా? 'దక్షవాదేవహాపం స్మృతీతి సతీ' యని కదా వ్యుత్పత్తి. సతీ శబ్దము పతివ్రతా పర్యాయపదము గదా!

'సుచరిత్రాతు సతీ సాధ్వీ పతివ్రతా' యని యమరము. సతి పరమేశ్వరుని యంకమును వాంఛించునా? 'కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్' అని పెద్దన. అట సతీశబ్దము స్త్రీమాత్ర పరమని పండితులు జనమంచి శేషాద్రిశర్మ మున్నగు వారు తీర్మానించిరి. ఇటకూడనట్లే తలంపవలయునా? పరమేశ్వరుని వృషభవాహనమును 'అసోఢ సింహధ్వని'గా వర్ణించెను. ఆ వృషభము సింహగర్జనలను సహింపదని తాత్పర్యము. ఇట సింహశబ్దము అర్థవంతము. సింహమను పేరెట్లు వచ్చినది? 'హినస్తి హస్త్యాదికమితి సింహః' వ్యుత్పత్తి. ఏనుగు మొదలయిన మృగములను హింసించునదని వ్యుత్పత్త్యర్థము. అట్టి సింహగర్జలను సహింపనిదీ పరమశివుని వాహనము. అనువాదమున 'అసోఢ కేసరిధ్వని' యని కలదు. సింహస్థానమున కేసరి యని యనుట చప్పగా నున్నదని చెప్పక తప్పదు. కేసరి యనగా జూలు కలదని యర్థము. కేసరివల్ల వృషభమునకు వన్నెరాలేదు. మన్మథునకు బాణములు సమకూర్చువాడు వసంతుడు. అతడు ప్రవాళోద్గమ చారుపత్రయుతమయిన నవచూతబాణము నిచ్చెను. ఈ పట్టున కాళిదాసు 'ప్రవాళోద్గమ చారుపత్రే' 'నవచూతబాణే' యని యన్నాడు. రావుగారు 'పల్లవోద్గమ రమణీయపత్ర మహితంబగు నూతన చూత కంకపత్రము' అని యనువదించిరి. కంకపత్రమనగా బాణమని యర్థము. రావులగుఱెక్కలు కట్టిన దౌటచే దానికాపేరు వచ్చినది. మధుడు పల్లవాంకుర పత్రములుగల నవచూతబాణము నిచ్చెననిగదా యర్థము. అట్టిచో రావులగుఱెక్కయి కట్టినదను నర్థముగల కంకపత్త్రము నిట యుపయోగింపదగునా? మూలమున బాణశబ్దము కలదు. అదియే యుచితము. పల్లవాంకుర పత్త్రము లున్నపుడు రావులగుఱెక్కల ప్రసక్తివన యుచితముగాదు. సూర్యు డుత్తరదిక్కునకు పోయినట్లు కాళిదాసు వర్ణించిన శ్లోకమునకు మల్లినాథసూరి ధూర్తపురుష పరముగా కూడ వ్యాఖ్యానము వ్రాసెను. 'కుబేరగుప్తాం' మున్నగు మాట లావ్యాఖ్యానమునకు హేతువులు. రావుగారు దీనిని గమనించినట్లు కానరాదు. 'ధనద గుప్తాశన్' అని యనువదించిరి. ఇది 'కుబేర గుప్తాం' వంటిదిగాదు. 'కుబేర గుప్తాం ధనపతి పాలితాం— కుత్సిత శరీరేణ కేనచిద్రక్షితాంచ' యని వ్యాఖ్య. ఈ వ్యాఖ్యార్థమంతయు రావుగారి 'ధనద గుప్తాశన్' అనునది యిచ్చునా? సెజ్జపై పొరలాడునపుడు వేణీపరిచ్యుతము లయిన పుష్పము లొత్తుకొన్నచో క్లేశము పొందు పార్వతి తనచేతిని దిండుగా చేసికొని స్థండిలశయన యయినదని కాళిదాసు. పుష్పాధిక సుకుమారశరీరము కలదని భావము. అది వ్యంగ్యముగా నున్నది. రావుగారు అనువాదములో ఎత్తుగడయుండే 'ఏపువుఁబోఁడి వేణి ఘటియించిన పుష్పములన్' అని యనిరి. పువుఁబోఁడియని యనుటవలన వ్యంగ్యము వాచ్యమై శోభ పోయినది. పై జెప్పిన వానివంటివి యింకను రెండుమూఁ డుదాహరణము లున్నవి.

కొన్నిచోట్లనున్న కుంటినడకల కేమిగాని, మృత్యుంజయరావుగారి రచనము ధారాళమయిన శయ్య కలది. ఈ యాంధ్రభాషలో పద్యరచనము పోయిన డుసుపోకడలను ఏ యితర ప్రక్రియయు ప్రాచీన కాలమున సంతరించుకొనలేదు. ఆంధ్ర కుమారసంభవమున పద్యరచనా సౌందర్య మెట్లున్నదను ప్రశ్నకు పాఠకులే యెవరికివారు సమాధానము చెప్పికొనవలసి యున్నది. కొన్నికొన్ని పద్యముల రచనము మనోహరము. ఈ క్రింది వానిని జూడుడు.

వాడు వాఁడిన వదనసంపదల నసరు
నమరులకు బ్రహ్మ యపుడు ప్రత్యక్ష మయ్యెఁ

దిమ్మలు ముడుంగుటను సొంపు దఱిఁగియున్న
కొలఁకులకు వేగువేళ వేవెలుఁగుఁ బోలె.

ఇందు పదముల కూర్పు శిల్ప మయమై యున్నది. ఆట్లే

మందాకినిలో దిగ్గజ
బృందమదావిల జలంబు యివ్విధు మివిలెన్;
కెందామర పంటల కా
బృందారకవైరి బావు లిరవయ్యెనయా!

అను పద్యము చెప్పుచున్నవారి మనస్తత్త్వము నెఱిఁగి చేసిన రచనమునకు తార్కాణముగా నున్నది. పంచమ సర్గమునందలి యిరువదియవ పద్యము, డెబ్బదియేడవ పద్యము షష్ఠ సర్గమునందలి యిరువదిమూడవ పద్యము, రావుగారి రచనాశక్తిని స్పష్టము చేయును.

ఈ కవి ఔచిత్యము నెఱిఁగి పదముల నుపయోగించు శక్తిగలవారుగా నున్నారు. ఒక్క యుదాహరణము. మన్మథుడు పరమేశ్వరుని ధ్యానప్రదేశము ప్రవేశించెను. అప్పుడు ఈ కవి 'దక్షసంహరు ధ్యానాస్పదమ్ముఁ జొచ్చె' ననిరి. కాళిదాసు 'భవాతపశే' అని యనగా వీరు 'దక్షసంహరు' అనిరి. దక్షసంహరు అని యనుటచే మన్మథుని యాగామి మరణము సూచితమయినది. ఇట్లు సూచించుట శిల్పనైపుణ్యమును పట్టి చూపును.

మృత్యుంజయరావుగారీకావ్యమును హిమవంతున కంకితము చేయుట నూతనముగా నున్నది.

## కాళిదాస హృదయము

[కర్త:—విద్వాన్ ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి; వెల:—రూ. 4.00; ప్రాప్తిస్థానము:— భారతీయ విద్యాప్రచురణలు. ముంగండ. (వయా) అంబాజీపేట. తూర్పుగోదావరి జిల్లా.]

సర్వతోముఖ సమృద్ధిగల సాహిత్యము సంస్కృత సాహిత్యము. తెలుగువారికి దానిపట్లగల వలపు ఈ నాటిదిగాదు. ఈ వలపు ఒక రకముగా తెలుగుబాసకు ఓజస్సును తేజస్సును కలిగించినది. ప్రాచీనాంధ్ర సాహిత్యమును పరిశీలించినచో, తెలుగువారు సంస్కృత సాహిత్యమునకు ఎంతగా ఋణపడి యున్నారో తేట తెల్లమగును. పాశ్చాత్యపండితుల పుణ్యమా యని, పోయిన రెండు మూడు వందల యేండ్లలో సంస్కృతభాష మహత్తు ప్రపంచమునకు విదితమయినది. జీర్ణమై చివికిపోవుచున్న సంస్కృత గ్రంథములను చిత్తశుద్ధితో, ఆర్జవముతో పరిష్కరించి, ఆ గ్రంథముల తత్త్వమును శాస్త్రీయ పరిశోధనా పూర్వకముగా నలుగురకు తెలిపిన ఖ్యాతి నిష్కామసేవా పరాయణులగు పాశ్చాత్య పండితులదే. వారి త్రోవ త్రొక్కిన భారతీయ పండితులు సంస్కృతభాషా పరిశోధనా క్షేత్రములో ముక్కారు పంటలు పండించిరి. మహారాష్ట్రులు, వంగరాష్ట్రీయులు, తమిళులు, కేరళ పుత్రులు సంస్కృతభాషా సరస్వతికి చేసిన సేవలకు నెంతని వెల కట్టగలము? తెలుగువారు సంస్కృతభాషా పరిశోధనకు ఎంత మూల్యము చెల్లించిరో చెప్పుకొనుటకేమయిన నున్నదా? మానవల్లి రామకృష్ణకవి వంటివారు ఎంతమంది యుండిరి? ఉన్నారు? ఈ యాంధ్రజాతికి సంస్కృతముపట్ల అంతులేని మోజు చూపుట రివాజయినదే తప్ప, ఆ సాహిత్యమునందలి విశేషాంశములు మాత్రము వెల్లడి కాలేదు. ఈ వేళ సంస్కృతమందలి వేద వాఙ్మయమును గూర్చి, ఇతిహాసములను గూర్చి, కావ్యములను గూర్చి తెలుగువాడు తెలిసికొనవలయునన్నచో, విమర్శలు వ్రాయవలయునన్నచో ఆతనికి అనాంధ్రపండితుల గ్రంథములే యాధారములు. పాశ్చాత్య పండితుల పలుకులే ప్రమాణములు. మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారి సంస్కృత వాఙ్మయ చరిత్రము తప్ప మనకు మఱియొక గ్రంథము లేదే! సంస్కృత సాహిత్యశాస్త్ర గ్రంథములు ఆంధ్ర భాషలో అవతరించినవి. వానిలో చాల కొన్ని యనువాదకుల పాండిత్య ప్రాగల్భ్యమునకు తార్కాణములు. మాతృకలకంటె క్లిష్టములు. సంస్కృత కావ్య నాటకముల కళాశిల్ప సౌందర్యమును కరతలామలకము చేయు గ్రంథములు తెలుగులో హుళక్కి. మన యుభయభాషా ప్రవీణులకు సంస్కృత కావ్య నాటకముల ననువదించి వానిని విశ్వవిద్యాలయ పాఠ్య గ్రంథములుగా చేయవలయునను వారాటము తప్ప మఱొక యుత్తమ లక్ష్యము లేదు. ఆ యనువాదము

ఎట్లుండునో కళాశాలలలో ఆంధ్రభాషను బోధించు ఆచార్యులకు అనుభవసిద్ధమే. సంస్కృత భాషా ప్రశంసలకు మాత్రము తెలుగు మాగాణమున కొఱత లేదు. విజ్ఞానకారియగు కార్యము మాత్రము శూన్యము. పొగడ్తలతో ప్రొద్దుపుచ్చు దేశము క్రియాశీలము గాదు. ఒకవేళ క్రియ యున్నను అది యారంభ శూరత్వ మగును.

మహాకవి కాళిదాసెవరో తెలుగువారికి తెలియును. ఆయననుగూర్చి యీనాడు క్రొత్తగా చెప్పవలసిన దేమియు లేదు. ప్రాచీనాంధ్ర కవులు కాళిదాస కావ్యనాటకముల జోలికి పోలేదు. నన్నిచోడదేవుడు, శ్రీనాథుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు మున్నగువారు కావలసినచోట్ల కాళిదాస శ్లోకముల ననువదించిరి. కాళిదాస నాటకక్రమము ననుసరింతునని పినవీరభద్రుడు చెప్పుకొనెను. ఏది యెట్లయిన కాళిదాస కావ్యములు యథాతథముగా తెలుగునకు రాలేదు. రాఘవాభ్యుదయమువంటి ప్రబంధ ముండిన నుండుగాక! అది కాళిదాస రఘువంశమునందేకదేశమునకు మాత్రమే పెరిగిన ప్రతిబింబము. పోయిన వందయేండ్లలో కాళిదాస కావ్యనాటకములకు గద్యపద్యానువాదములు వెలసినవి. ఆయననుగూర్చి వినోద కథా గ్రంథములును రచింపబడినవి. కాని కాళిదాస కవితాకళావైభవము తెలుగువారికెంతవఱకు తెలిసిన దనునదే యనుమానము. కాళిదాస కవితా సమీక్ష యంతగా జరిగినట్లు కానరాదు. ఆ లోటును భర్తీ చేయుటకు ఇప్పుడిప్పుడే విమర్శకులు ప్రయత్నించుచున్నట్లున్నది అట్టివారిలో విద్వాన్ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారొకరు.

కాళిదాస హృదయమను నీ గ్రంథములో పదునొకండు వ్యాసము లున్నవి. మొదటి వ్యాసము 'ఉపమా కాళిదాసస్య' యనునది. ఉపమా కాళిదాసస్య యను లోకోక్తి జగత్ప్రసిద్ధము. సూర్యనారాయణ శాస్త్రిగారు ఉపమాలంకారతత్త్వమును ఉట్టంకించి, రఘువంశ కుమారసంభవ మేఘసందేశములయందలి యుపమాలంకారముల విశేషార్థములను సమగ్రముగా వివరించుటకు ప్రయత్నించిరి. కాళిదాస మహాకవికి 'దీపశిఖ' యను ఉపనామ మున్నట్లు నిదర్శనములు కలవు. శాస్త్రిగారా నిదర్శనములను పేర్కొని, కాళిదాసే యే సందర్భములలో దీపశిఖను మహోమోహనముగా వర్ణించెనో వక్కాణించిరి.

వాల్మీకి కాళిదాసునకు కవితాగురువను మాట యందఱెఱిగినట్టిదే. ఈ వ్యాసకర్త మూడవ వ్యాసములో శ్లోకముల యెత్తుగడల విషయమును, వర్ణనల సందర్భమున వాల్మీకి కాళిదాసున కేరీతిగా మార్గదర్శకు డాయెనో సోదాహరణముగా సూచించిరి. 'కాళిదాస సౌందర్య సమారాధనము—విశ్వప్రేమము' అనునది పెద్దది. శాస్త్రిగారి నిశిత కావ్యనాటక పరిశీలనమునకు తార్కాణముగా నున్నట్టిది. కాళిదాసు ప్రకారము ఎట్టి సౌందర్యము పరమోత్కృష్టమయినదో వ్యాసకర్త సవిస్తరముగా చెప్పిరి. వారి వ్యాఖ్య పద్ధతి యిట్లున్నది. కాళిదాసు పవిత్రప్రణయమును, పరిశుద్ధ దివ్యసౌందర్యమును తన కృతులలో ప్రతిపాదించెను. మానవజీవితములో యౌవన సౌందర్యములు సంక్లిష్ట సమస్యలు. యౌవనాహంకారమయమైన సౌందర్యము కామ స్పర్శ కలిగినట్టిది. ఆ యహంకారము, ఆ కామము సంపూర్ణముగా క్షాళితము లయినగాని దివ్యసౌందర్యము తేజరిల్లదు. పార్వతీ రూపలావణ్యము, శకుంతలా దేహ సౌందర్యము ఆదిని యౌవనాహంకారదోషదూషితములు. ఆ సమయముననే వారి కిరువురకు జీవిత నాయకులు ప్రాప్తించిరి. కాని తారకాసుర సంహారము చేయు కుమారుని, ఒక మహాజాతికి నాయంకరము పూనదగిన పుత్రుని పడయుటకు వారు తగినవారు గారు. పార్వతీ మనశ్శుద్ధికి, శకుంతల యంతరంగ శుచికి నాయికానాయకుల యెడబాటు అవశ్యము అపేక్షణీయము. అందుచేతనే కుమారసంభవమున కామదహనము సంభవించినది. అభిజ్ఞాన శాకుంతలమున దుర్వాసశ్శాపము వర్ణిత మయినది. పిదప పార్వతి తపస్సు చేసినది. శకుంతల మారీచాశ్రమములో నియమకృశముఖి యయినది. అప్పటికిగాని వారి హృదయములు కామవిముక్తిని పొందలేదు. వారి భౌతిక సౌందర్యము దివ్యసౌందర్యము కాలేదు. కామదూషితమయిన నైయక్తికమైన వలపు విశ్వప్రణయమై భాసిల్లినది. తుదకు నాయక సంయోగము

సంప్రాప్తించినది. ఇట్టి పవిత్ర ప్రణయమే భారతీయ గార్హస్థ్య జీవనమునకు పట్టుగొమ్మయని శాస్త్రిగారి తీర్పు. ఈ తీర్పు విమర్శకుల మన్ననలను పొందునట్టిది.

మనుష్య మధురజీవనయాత్రకు ప్రకృతి సహజీవనము పరమసాధనమని కాళిదాసుని యభిప్రాయమయినట్లు 'కాళిదాసు-ప్రకృతి జీవనము' అను వ్యాసము వక్కాణించుచున్నది. ఋతుసంహారము కాళిదాసు ఆదిమకృతియని యంగీకరించి, యందలి వర్ణనములే తదనంతర కావ్యముల ఋతువర్ణనములకు బీజప్రాయములని శాస్త్రిగారు 'ఋతుసంహారము-కవితాసామగ్రి' యను వ్యాసమున చెప్పిరి. కాళిదాసు ఆరు ఋతువుల నెట్లు రమణీయముగా వర్ణించెనో సమర్థించుటకు ఆయా ఋతువర్ణనముల శ్లోకములకు తాత్పర్యము వ్రాసికొనుచు పోయిరి. 'కాళిదాసు-హిమాలయ ప్రకృతి' యను వ్యాసము జంగమస్థావర రూపమగు హిమాలయ ప్రకృతిని వెల్లడి చేయుచున్నది. 'సూక్తిమౌక్తికములు' అను వ్యాసము కాళిదాసు పరిణత ప్రజ్ఞను లోకానుభవమును చాటు సూక్తుల నొకచోట చేర్చినట్టిది.

కాళిదాసు హైందవ కవి. హైందవ ధర్మశాస్త్రములను, హైందవ శ్రౌత సూత్రములను జీర్ణము చేసికొని, తన కావ్యములయందంతట నుచితముగా వర్ణించినవాడు. మల్లినాథ సూరి కాళిదాస కావ్యములకు వ్యాఖ్యానములు వ్రాయుచు, ఆ మహాకవి అపార విజ్ఞానమును బట్టబయలుచేసెను. 'శ్రీ కాళిదాసు-ధర్మశాస్త్ర విజ్ఞానము' 'శ్రీ కాళిదాస మహాకవి-శ్రౌత విజ్ఞానము' అను రెండు వ్యాసములు మల్లినాథుని అపార శేముషీ సంపదకు నిదర్శనములు. గ్రంథస్థ ప్రమాణములతో వ్యాఖ్యానించిన మహామహోపాధ్యాయుడు మల్లినాథ సూరి. శాస్త్రిగారు మల్లినాథుని వైదగ్ధ్యమును బహూదాహరణముల నొసగి ప్రకటించిరి. 'శ్రీ కాళిదాస శివభక్తి తత్త్వము-తత్త్వజ్ఞాన వైభవము' చిట్టచివరి వ్యాసము. కాళిదాసు విశ్వము శివమయమని భావించెను. ఇట శివశబ్దము పరబ్రహ్మవాచకము. బ్రహ్మాండమున నిండియున్న దొకటేశక్తి. ఆ శక్తి సందర్భోచితముగా మూర్త్యంతరములను ధరించును. కాళిదాసు త్రిమూర్తుల యభేదమును భజించెను. తత్త్వజ్ఞాన వైభవము అను భాగమున కాళిదాసు తన వాక్కుల మాటున దాచిన తత్త్వజ్ఞానమును శాస్త్రిగారు వెలికి దీసిరి. ఈ భాగము శాస్త్రిగారి యూహలను స్పష్టముగా చూపును. అంతగా తృప్తి కల్గింపదు—హేతుదూరము గావున.

ఈ విధముగా సూర్యనారాయణశాస్త్రి గారు కాళిదాసుని కావ్యములను అనేక దృక్పథములనుండి సమీక్షించిరి. కాళిదాస శ్లోకముల వ్యంగ్యమును పరామర్శించిన విధము శాస్త్రిగారి విమర్శనాపాటవమును చూపును. ఈ గ్రంథమునందంతట అనుభూతి ప్రధానమయిన విమర్శ కలదు. ఎందువలననో గాని శాస్త్రిగారి విమర్శ యొక్క కొన్ని చోట్ల వ్యంగ్యార్థములను వివరించినట్లుగా గాక తెగ గుంజినట్లుగా నున్నది. ఆ సందర్భములు శాస్త్రిగారికి కాళిదాసు పట్లగల భక్తిని చూపునవేగాని, యుత్తమ విమర్శకు లక్ష్యములు గావు. తాటకీ సంహార శ్లోకమును వివరించుచు 'మహాకవీ! నీ యుపమానములో నేదో బీజాక్షర సంపుటి యున్నదయ్యా!' యని యనుట శాస్త్రిగారికే చెల్లినది. పారవశ్యముతో వ్రాసిన యిట్టి వాక్యములు ఈ గ్రంథమున ననేకములు గలవు. ఇట్టి వాక్యములవలన రచనమునకు శోభ చేకూరదు. 'రఘు వంశ ప్రదీపేన' అను విశేషణము రఘువంశ మహాకావ్యము ఇతర కావ్యములకు ప్రకృష్ట దీపము వంటిది యను విశేషమును ధ్వనింపజేయుచున్నదట! 'అద్యప్రభృత్యవనతాంగి తవాస్మిదాసః క్రీతస్తపోభిరితి వాదిని చంద్రమౌళౌ......' అను కుమారసంభవ పంచమ సర్గాంత శ్లోకము కాళిదాసు కాళీమాతకు అంజలి ఘటించినట్లున్నదనుట శాస్త్రిగారి పాండితీ ప్రౌఢిమను చూపినంతగా సత్యమును చాటదు. 'అవనతాంగి! నేటినుండి నీ తపస్సునకు అమ్ముడుపోయితి'నని పరమేశ్వరుడు పార్వతితో అన్న మాటలలో కాళిదాసుని కాళీభక్తి తత్పరత ప్రకాశించుచున్నదా? 'యా సృష్టిః స్రష్టురాద్యా...' అను అభిజ్ఞానశాకుంతల నాంది శ్లోకమున 'కాళిదాస కవిబ్రహ్మ యొక్క సుందరవస్తు సృష్టిలో శకుంతలయే యుత్తమోత్తమమగు మొట్టమొదటి సుందర వస్తుసృష్టి'యని ధ్వనించుచున్నదట! కాళిదాసు గౌరీముఖ

ననువర్ణించుచు 'కాంతిలక్ష్మి చంద్రునాశ్రయించి కమల గుణమును పొందలేకపోయినది. కమలము నాశ్రయించి చంద్రుని గుణము పొందలేకపోయినది. కాని ఆ లక్ష్మి గారీ ముఖము నాశ్రయించి చంద్రారవిందముల నాశ్రయించినప్పటి ప్రీతిని ఒక్కసారిగా పొందిన'దని చెప్పెను. ఈ వర్ణనమున 'సంస్కృత కవితాలక్ష్మి ఉమా ముఖలక్ష్మివంటి కాళిదాసుని కావ్యలక్ష్మిని పొంది ఐహికాముష్మిక రూపమయిన ద్వివిధ ప్రీతి నొక్కసారిగా పొందిన'దను నర్థాంతరము కలదట! గురుదక్షిణకై తనవద్దకు వచ్చిన వరతంతువౌని శిష్యునితో 'శ్రుతపారదర్శి యగువాడు తనను గురు దక్షిణ యాచించి, పొందలేక మఱొక దాతకడకు పోయినచో ఆ యపప్రథను ఈ రఘుమహారాజు భరింపలేడ'ని రఘువు పలికెను. ఈ శ్లోకమున ధ్వని యున్నదట! అది యేమి? 'వేదాంతవేత్తయగు విద్యార్థి మోక్ష పురుషార్థమును గోరివచ్చి ఆ కోర్కెను రఘువంశ కావ్యమునుండి పొందలేక మఱియొక గ్రంథము చదువుట కలిదు వెడలినాడను నపవాదము కాళిదాసునకైన వాకు లేకుండుగాక!' అని కవి పాఠకుని ప్రబోధించుచున్నాడట! వేదాంతవేత్తయగు వాడు మోక్షమును గోరి కాళిదాసు రఘువంశమును చదువునా? తత్త్వజ్ఞాన వైభవమును చరమ వ్యాసభాగమంతయు నిటువంటి యూహల యల్లిక. ధ్వని యనునది ప్రకరణ సంగతమై యుండవల యును. వాక్యములను ప్రకరణమునుండి యావల కీడ్చి, ధ్వనులను వెదకుట ప్రారంభించినందువలననే శాస్త్రిగారీ బుట్టల నల్లిరి. విమర్శకుడు కవి హృదయముతో సమానమయిన హృదయము గలవాడై యుండవలయునే కాని కవి విమర్శకుని హృదయముతో సమానమయిన హృదయము కలవాడు గారాదు. అనగా విమర్శకుడు తన భావములను కవి భావములుగా చేయరాదు. ఇట్టి విమర్శ కొన్ని యేండ్లనుండి తెలుగులో వచ్చుచున్నది. పరిణత భావభాసురులకే సహృదయులైనవారికే యిట్టి యర్థములు, ఇట్టి ధ్వనులు అవగాహనము గునని శాస్త్రిగారు మాటిమాటికి అనుట, తాము చెప్పుచున్నదే పరమ యథార్థమని యనుకొనుటవలన కలిగిన ఫలము.

'ఆభరణస్యాభరణం' యను శ్లోకము. అగ్ని మిత్రుడు విదూషకునకు ఊర్వశీ సౌందర్యము వర్ణించు సందర్భమునందలిదని 82 వ పుటలో నున్నది. శాస్త్రిగారే యా శ్లోకము విక్రమోర్వ శీయము ద్వితీయాంకమందలిదని యుదాహరించిరి. అగ్నిమిత్రుడు మాళవికాగ్నిమిత్ర నాటకమున నాయ కుడు. అత డూర్వశీ సౌందర్యమును వర్ణించుట యెట్లు పొసగును? ఈ పుటలో రెండవ పేరా యందలి వాక్యములు స్పష్టముగా లేవు. 'ఇయం గేహే లక్ష్మీః' అను శ్లోకము భవభూతి యుత్తర రామచరితమునందలి ప్రథమాంకములోనిది. సీతాదేవి చిత్రపట దర్శనానంతరము అలసట పొంది రాముని వక్షస్థలముపై నిద్రించినది. రాముడా నిద్రాపరవశు రాలిని జూచి పై శ్లోకముద్వారా తనకు సీతపట్ల గల పరమప్రణయానురాగములను వెల్లడించును. ఆ సందర్భము రామవిలాప ఘట్టము కానేకాదు. కాని శాస్త్రిగారేమో 'శ్రీరామచంద్రుడు కూడ నిండు చూలాలైన సీతాదేవిని లోకారాధనమునకై అరణ్య ముల పాలుచేసి అమె ప్రణయమును దలంచుకొని యిట్లే విలపించినాడు' అని 'ఇయంగేహే లక్ష్మీః' అను శ్లోకము నుదాహరించిరి. ఇది సమంజసముగా లేదు. రఘుమహారాజు కౌత్సమహర్షిని కుశల మడుగగా ఆయన 'రఘువు పాలించుచున్నపుడు ఏ బాధ లుండవు. లోకమునకు శుభములే కలుగును. సూర్యుడు ప్రకాశించుచుండగా అంధకారము లోకమువారి దృష్టి నావరింపజాలదు' అని యనును. 'దిలీపుడు పరిపాల కుడై యుండగా మా కందఱకు కుశలమే కలుగు చుండు'నని కౌత్సమహర్షి యన్నట్లు శాస్త్రిగారు వ్రాసిరి. రఘువు దిలీపుడు గాడు. దిలీపుని కుమా రుడు. 133 వ పుటలో 'అడవియేనుఁగులు క్రొత్త మేఘధ్వనులచే మదించి గర్వించుచున్నవి'యని యున్నది. గర్వించు అన్నక్రియ కానరాదు. అది 'గర్జించు' అను క్రియయొక్క అచ్చు తప్పేమో! అట్లయినచో ఏనుగులు గర్జించునా? మేఘములు గర్జించును. సింహములు గర్జించును. ఈ గ్రంథమున అచ్చు తప్పు లనేకములు గలవు. 'గౌరవనీయములు' అను మాట అసాధువు. శాస్త్రిగారివంటివా రుపయోగింప దగినదిగాదు. 'వెళ్లమని' (పుట. 165) యని యన రాదు. వెళ్ళుమని యనవలయును. 'ఇతడి' (పుట. 52) అతడి (పుట. 96), శక్తివంతము (పుట. 146) అచ్చు తప్పులేమో!

భారతీయునకు భారతదేశాభిమానము భారతీయ సంస్కృత్యభిమానము సహజము. ఏ యభిమాన మయినను హద్దులో నుండవలయును. సమదర్శనముతో కూడియుండవలయును. సూర్యనారాయణశాస్త్రిగారు భారతీయ సంస్కృతి యనగనే పరవశించిపోవుట యట్లుండనిండు. వారా పారవశ్యములో నేమేమియో వ్రాయుదురు. చూడుడు. భారతీయ కవితాసౌందర్యము 'కేవల భౌతిక విషయ లంపటమైనది' కాదట! భారతీయులు ఇంద్రియములకు దాసులు గారట! సౌందర్య తత్త్వ విషయమున కాళిదాసు కీట్సునకు (ఆంగ్ల కవి) మార్గదర్శకు డయ్యెనట! శరణాగత రక్షణాది సుగుణములను భారతీయులు 'హిమనగ ప్రకృతి' నుండియే నేర్చియుండవచ్చునట! భారతీయ దివ్య సాంప్రదాయములు ఒక్క భారతదేశమునకే కాక ప్రపంచమునకే శ్రేయోదాయకములనుటలో సందేహము లేద'ట! 'భారతజాతిలో నేదేని యద్భుతశక్తి యున్న దన్నచో నట్టిది భారతీయుల శ్రౌతక్రియా నిర్వహణము వలననే అని యనవలసి యున్న'దట! కాళిదాసు కావ్యములను పఠించి, ఆ కావ్యములలో గల 'విశ్వప్రేమ'తో ప్రపంచమునకు ముఖ్యముగా 'చైనా వంటి దురహంకారపూరిత దుష్ట సంఘములకు వెలుఁగుబాటను జూపుట విజ్ఞుల కర్తవ్యమై యున్న దట! ఈ మాటలు అతిశయోక్తులు మాత్రమే గాదు అబద్ధములు గూడ. సంస్కృతాంధ్ర భాషా సాహిత్య కవితలో నెంత విషయవాసన యున్నదో శాస్త్రి గారు మఱచినట్లున్నది. ఆ విషయ లంపటత్వ మెక్కడిది? సంఘమున నున్నదే సాహిత్యమున కెక్కినది. తమ భార్యలు నలమహారాజ సౌందర్యముచే ఆకర్షింప బడుదురేమో యను తలంపుతో, వారిని త్రిమూర్తులు భద్రముగా కాపాడుకొనిరని వర్ణించునంతవఱకు శ్రీహర్షుడు పోయినాడు? కుమారసంభవమందలి యష్టమ సర్గమును కాళిదాసు రచింపలేదని మన శ్రోత్రియు లన్నప్పటికి, ఆ మాటలకు విలువ యెంత? మన పురాణ వాఙ్మయము, సంస్కృతాంధ్ర కావ్యములు పచ్చి కామ వర్ణనముతో కూడిలేవా? కోణార్కమున్నగు చోట్లనున్న కామశిల్పమున కర్థమేమి? విపులముగా చర్చించుట కిది చోటుగాదు. శాస్త్రిగారు వేనినో 'దివ్య సాంప్రదాయము' లనుచున్నారే యవి భారతీయులలో నెందఱకు శ్రేయస్సును కలిగించినవి? ఈ జాతి యద్భుతశక్తి శ్రౌతక్రియా నిర్వహణమున లేదు? మఱి భిన్నత్వమున ఏకత్వమును దర్శించుట భారతీయ శక్తి యుక్తులకు ఉదాహరణము. ఇంత కంటె నెక్కువ వ్రాయుట యనుచితము.

అరవిందమహర్షి చెప్పినట్లుగా కాళిదాసు భారతీయ సంస్కృతి పరిణామ దశలో మూడవది యగు రసమయ జీవనమునకు ప్రతినిధి. స్వాభిమానమునకు పోకుండ, సంయమనముతో, ఆ మహాకవి కావ్యములను తెలుగువారు చదివి పరీక్షింపవలయును. సూర్యనారాయణశాస్త్రిగారు రచించిన యీ 'కాళిదాస హృదయము' అటువంటి ప్రయత్నములకు నాందియని భావింతము గాక!

—శాక్యసింహ.

## సుగుణ

[నవలిక. రచయిత: శ్రీ బలివాడ కాంతారావు. ప్రచురణ: శ్రీమతి ఆర్. వి. రమణమ్మ శోభా ప్రచురణలు (సాహిత్యోద్యమ సంస్థ) విజయనగరం—2. డిస్ట్రిబ్యూటర్సు: 1. విశ్వసాహిత్యమాల, రాజమండ్రి—2. 2. హిమాంశు బుక్ డిపో. విజయనగరం—2. పేజీలు 115. వెల రూ. 2—00.]

ఈ నవలికలో ప్రధాన పాత్రలు భార్యాభర్తలు. భార్య సుగుణ, గుణవతి విద్యావతి. తన అర్హత స్థానం గుర్తించిన వ్యక్తి. వ్యక్తిత్వానికి ముళ్లకంచెలా కనిపించేది త్యజించటానికి వెనుదీయని శీలవతి. కాలేజీ చదువు మధ్యలో ఆపివేసింది. మంచి సంబంధాలు వదులుకొంది. ప్రేమించగల భర్తను ఎన్నుకోవటమే ఆమె జీవితంలో సాధించిన ఘన కార్యం. ఆమె తిట్టినట్లే మాట్లాడుతుంది. తిట్టదు. పొగడినట్లే వుంటుంది. పొగడదు. చాలా గడుసు మనిషి. తను కోరింది అడక్కుండా భర్త చేత తెప్పించుకోగలదు, చెప్పించుకోగలదు. చేయించుకోగలదు.

భర్త గుమాస్తా! చిన్నతనంలో అల్లరి చిల్లరగా పెరిగి పెద్దవాడయి, పెద్దవాడయిన వ్యక్తి. భార్య కంట తడిపెడితే సహింపలేడు. స్త్రీకి వ్యక్తిత్వం వుందని గ్రహించి, దాన్ని గౌరవించటం అలవాటు చేసుకొన్న మనిషి. భార్యను సంతోషపెట్టటానికి

హృదయపూర్వకంగా ప్రయత్నిస్తాడు. ఆమె బాధపడితే బాధోపశమనం కలిగింపజూస్తాడుగానీ, ఆ యత్నంలో ఆమె వ్యక్తిత్వం దెబ్బతింటుందంటే నిర్వికల్పంగా ఆలోచించగల సమర్థుడు.

ఈ రెండు పాత్రలతోపాటు పాఠకుల దృష్టిలో నిలిచిపోయే పాత్రలు సావిత్రి. రచయిత. చిన్నతనంలో శిరోముండనంతో కనిపించే సావిత్రి. పెద్దయి పెళ్లి నిర్ణయంపట్ల ఇష్టానిష్టాలు ప్రదర్శింపలేని సావిత్రి, పెళ్ళయిన సావిత్రి – ఏవిధంగా సావిత్రిని చూచినా పాఠకులకు దిగులు కలుగుతుంది.

రచయిత దయనీయ పరిస్థితి, ఇల్లు వదిలి పారిపోయిరావటం, నిరాశ్రయుడుగా జీవించటం. అర్థాతా పర్థతలు గుర్తించి ప్రవర్తించటం, ఎదుటివారి శ్రేయస్సునే కాంక్షించటం చూస్తే రచయితలోని ఔన్నత్యం పాఠకులను సంతోషపెడుతుంది. రచయిత మూర్చిన జీవితం కథానాయకుడిలో చూచి సుగుణ సంతోషించినట్లే పాఠకులు సంతోషిస్తారు. తను బాధపడినా ఇతరులు సంతుష్టి పొందాలని తపనచెందే రచయిత పాత్ర ఉదాత్తమయింది.

పాత్ర సృష్టిలో శ్రీ బలివాడ కాంతారావు చూపిన నేర్పు విశిష్టమయింది. ఎంత చిన్న పాత్ర అయినా మనస్సులో నిలచిపోయేటట్లు మలచగల రచయిత ప్రజ్ఞ తిలకించిన పాఠకులు సంతోషాంతరంగు లవుతారు. ప్రతి పాత్రా ఒక చెరగని ముద్రవేస్తుంది. నవలిక చదివి ముగించిం తర్వాత ప్రతి పాత్రా పరిత్రులోకం కళ్ళముందు తిరుగాడుతుంది. చిన్న సంఘటనతో, చిన్ని వాక్యంతో పాత్ర వ్యక్తిత్వం కాంతిమంతమయి గోచరిస్తుంది.

పెళ్ళయిన మూణ్ణెల్ల తర్వాత రెండూ మూడు రోజుల్లో జరిగిన కథలో గుర్తు తెచ్చుకొన్న గతం చిత్రితమయిందీ నవలికలో. భార్య తన 'ప్రేమ కథ చెబుతూవుంటే ఏ మాత్రం పంచలనం ప్రదర్శింప లేదు భర్త. భర్త తన గత జీవితం చెబుతూవుంటే ఏ మాత్రం పట్టించుకోనట్టు కనిపించిన సుగుణ కథాంతంలో కడుపునొప్పి వచ్చినట్లు ప్రవర్తించటం అర్థమయితే స్త్రీత్వం అర్థమయినట్లే! సుగుణ చెప్పిన ప్రేమ కథ నిజమా, అబద్ధమా? నిజమయితే అంత లౌకికురాలయిన సుగుణ వంటి స్త్రీ అలా చెబుతుందా ? చెప్పకపోవచ్చు. అబద్ధమా ? అయితే ఎందుకు కల్పించింది ? భర్తచేత తన ప్రేమ గాథ చెప్పించటానికా? కావచ్చు. అది నిజమయితే ఆమె నేర్పు వంద్యం. రచయిత నేర్పు ఉత్తమం. సుగుణ చెబుతూ వున్నది, కల్పన అయినా అనుకోవాలి లేక భర్తలో క్షమాగుణం అయినా వుండాలి. ఆమె చెప్పింది నిజమా అబద్ధమా అని తేల్చుకోవటానికి భర్త ప్రయత్నించలేదు. సుగుణ పలికిన చివరి మాటవల్ల పూర్తి సత్యం తెలుస్తుంది. ఈ నవలిక చదివి పాఠకులు ఆ సత్యం గుర్తిస్తారు.

పెళ్ళయిన కొత్తలో ఎవరయినా తమ పూర్వ ప్రేమ వ్యవహారాలు చెప్పుకొంటారా అనేది ప్రశ్న! ఎందరో మహానుభావులు. కొందరు చెప్పుకోవచ్చు. చెప్పుకోవటం వాస్తవమయితే నవలిక అంతా వాస్తవంగా వుంది. ఈ రచన జీవితమే చిత్రించింది. పులుముడు లేకుండా, ఉదాత్తభావ వ్యక్తీకరణంతో సమాజ చిత్రణ చేయగల రచయితలలో శ్రీ బలివాడ కాంతారావు సముచితస్థానం సముపార్జించుకొన్న సత్యం పాఠకులకు ఇతఃపూర్వమే తెలుసు. ఆ సత్యం ఈ నవలికలో పునస్సందర్శనం అవుతుంది.

ఈ నవలికలో రచయిత పేరుతో ఒక పాత్ర వుంది. ఆ రచయిత కొన్ని కథలు వ్రాశాడు. ఆ చిత్రణ కథానాయకుడి స్వభావ చిత్రణలాగా వుంది. ఆ కథలవల్ల కథానాయకుడిలో పరివర్తన రావటం బాగుంది. ఆ కథలు చక్కని రచనలు కూడా! అయితే అవి ఈ నవలికలో యథాతథంగా చెప్పటంవల్ల కథా గమనంలో మార్పు వచ్చింది. ఆ మార్పు ఉచితం కాదు.

భర్త భార్యతో ఎప్పుడో రచయిత చదువుకోమని ఇచ్చిన కథలు చెప్పేటప్పుడు ప్రధాన విషయాలు చెప్పటంతో అవాస్తవికత లేదు. సంభాషణలు క్రమంగా ప్రత్యక్షర పరమార్థంగా చెప్పటం కొంత వరకు వాస్తవికం కాదు.

హృదయం తాకే ఉదాత్త విషయాలు స్వల్ప శ్రమతో, చిన్నివాక్యాలతో చెప్పగల నేర్పు రచయితకు వుంది. జీవితంనుంచి జనించిన ఇటువంటి కథలు చాలా తక్కువమంది వ్రాయగలరు. తెలుగు నవలా సాహిత్యంలో ఒక మంచి రచన చదవాలనుకునేవాళ్ళు ఈ 'సుగుణ'ను చదువవచ్చు.

## హుసేన్ సాగర్

[కథల సంపుటి. రచయిత్రి: శ్రీమతి రేవనూరి శమంత. ప్రకాశకులు: యం. శేషాచలం అండ్ కో., మద్రాసు—1. మచిలీపట్టణం, సికింద్రాబాదు. ప్రాప్తిస్థానం: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు. రాష్ట్రపతి రోడ్డు సికింద్రాబాదు. పేజీలు 184 వెల రూ. 2—00.]

రచయిత్రికి జీవితంగూర్చి కొన్ని స్థిరమైన అభిప్రాయాలున్నాయనిపిస్తుంది. వాటి బాగోగులు ఎవరెవరికి ఎలా అనిపించినా, రచయిత్రి ఆ అభిప్రాయాలు విశ్వసించి రచనాజీవితంలో అమలు పెడుతున్నట్లు కథలు చెబుతున్నాయి. ప్రేమ పెళ్ళి—వీటినిగూర్చి రచయిత్రి భావాల తీరు వేరు. పెళ్ళి అసహజం, అనవసరం అన్న భావన ప్రతి కథలోనూ ప్రత్యక్ష మవుతుంది. ప్రేమ అనేది నిర్వచించటానికి అందుబాటులో వుండదనీ, ఎదుటి వ్యక్తితో మాట్లాడేటప్పుడు తన్మయత్వం వళ్ళుమరచిపోవటంవంటివి జరిగితే ఆ వ్యక్తితో ప్రేమ ఉన్నట్లు లెక్కగానీ, గౌరవం, భక్తి, అభిమానంవంటివి ఏం కలిగినా అది ప్రేమగాదనీ, సర్వసద్గుణసంపన్నురాలుగా అత్యంతానుకూల్యవతిగా కనిపించే భార్యలోనూ ప్రేమ లేకపోవచ్చుననీ, ఆమె పెళ్ళికి పూర్వం తప్పకుండా ఎవరినో ప్రేమించి వుంటుందనీ, భర్తపట్ల విధి నిర్వహణ, బాధ్యత నెరవేర్చటం చూచి ఆమెలో ప్రేమ వుందనుకోవటం ఆత్మవంచన అన్న తీరులో రచయిత్రి వ్యక్తీకరించే అభిప్రాయాల ధోరణి వింతగా వుంటుంది.

ఈ కథానికల్లో ఉన్న ప్రధాన స్త్రీ పాత్రలలో, సామాన్యంగా చాలావాటిలో రచయిత్రి ప్రవేశపెట్టిన ఈ వింత గుణం కొంతలో కొంతయినా కొట్టవచ్చినట్లు వుంటుంది. అంతేగాక, ప్రధాన స్త్రీ పాత్రలకు సాధారణంగా తల్లిదండ్రులు చిన్నతనంలోనే చనిపోతారు. పాత్రలు పుట్టింటినుంచి, (ఉన్నచోటునుంచి) పారిపోతాయి. అష్టకష్టాలు పడతాయి. యౌవనంలో 'దుర్మార్గం' చేజిక్కబోయి, తప్పించుకొని పారిపోయి, యువకుడు చేజిక్కి ప్రేమించబడి, ఇద్దరిలో ఎవరికో పెళ్ళి ఇష్టంలేక, మళ్ళీ ఎక్కడికో, జీవితంనుంచో పారిపోవటం వుంటుంది. సాధారణంగా కథలన్నీ విషాదాంతాలో, విషాదాంతతుల్యాలో, విషాదతుల్యాంతాలో అవుతాయి. ప్రతి కథలో ఒక పురుష పాత్ర విస్కీనో, అటువంటిది ఏదో మత్తుపానీయం తాగుతుంది. ఎప్పుడో స్త్రీ పాత్రకూడా తాగి తల తిరిగి పడిపోయింది.

ఈ రచయిత్రి కథానికల్లో ప్రవేశపెట్టిన తత్త్వం నిశితంగా పరిశీలిస్తే, వాస్తవికతా దృక్పథంతో ఆలోచిస్తే ఇలా అనుకోవచ్చు. స్త్రీ పాత్రకు ప్రేమించటం ఇష్టం. ప్రేమించబడటం ఇష్టం. పెళ్ళి ఇష్టంలేదు. కొంతవరకు శృంగార జీవితం ఇష్టంలేదు. ఆరాధన ఇష్టం. తను దూరమయిపోతే ఆరాధించే యువకుడు పిచ్చివాడయి, చచ్చిపోయే యువకుడు ఇష్టం, అలాగే తనకు దూరమయిపోతే, వెర్రెక్కి అల్లాడిపోవటం ఇష్టం. మళ్ళీ క్రొత్త ప్రదేశం, క్రొత్త జీవితంఇష్టం. క్రొత్త పురుషుల సాంగత్యం, అదీ అయోమయ దశకు ఎదగటం, అటువంటి వాళ్ళతో తనను ఆరాధించే యువకుడి కథ చెప్పుకొని, గర్వపడి, వాళ్ళు ఈర్ష్య పడేటట్లుచేసి, వాళ్ళు బాధపడుతుంటే తనూ బాధపడి, బాధలో ఆనందం పొందటం ఇష్టం.

రచయిత్రి ఇటువంటి పాత్రలు అనేకంగా సృష్టించటంవల్ల తను నమ్మిన అభిప్రాయం ఏదో ప్రచారం చేయాలనే ఆశ వుందేమో అనిపిస్తుంది. ఆ అభిప్రాయం వెనుక జీవితంలో తిన్న ఎదురుదెబ్బలు, బాధలు ఉన్నాయేమోనని విజ్ఞులు తలపోస్తారు. అలాగే జరిగింది. 'శమంత జీవితంలో ప్రబలమైన విషాదభారం ఉన్నట్టు' శ్రీ సా. వెం. రాజమన్నారు భావం కాగా, 'ఒకానొక నిజమైన అనుభవాన్ని తనదిగాని సన్నిహితులైన వారిదిగాని...... ఆ అనుభవాన్ని విశ్వజనీనత' కలిగించే రీతిగా రచయిత్రి కథల్లినట్లు' శ్రీ అచంట జానకిరామ్ తలంచగా......అనుభవ పరంపర జతపరచి, కొంత భావన రంగరించి కథలువ్రాసి వాటికి 'విశ్వజనీనత కలిగించటంలో శ్రీమతి శమంత జాణ' అని ప్రకాశకుల పరిచయం.

ఈ కథలన్నింటిలోఉన్న ప్రధాన స్త్రీపాత్రల మనస్తత్వం వెనుక రచయిత్రి మనస్తత్వం నూటికి

మారుపాళ్లు దాగివుందన్న విషయం సత్యసన్నిహితం. ఆ దృష్టి పరిచయాలు కల్పించాయి. అందువల్ల పాఠకులకు, రచయిత్రి జీవితంలో కొద్దిభాగం ప్రతికథలోనూ చదువుతున్నామన్న అభిప్రాయంకలగే అవకాశం వుంది.

ఈ ప్రకాశకులు శ్రీమతి భానుమతీ రామకృష్ణ కథలకు పరిచయంలో 'శ్రీమతి భానుమతీ రామకృష్ణగారు' అని వ్రాసి ఈ రచయిత్రిని పరిచయంలోనే 'శ్రీమతి శమంత' అని వ్రాయటం అనుచితం. ఇద్దరు రచయిత్రుల పరిచయంలో ఆ వ్యత్యాసం న్యాయంకాదు. ఒకరిపట్ల గౌరవం, ఎక్కువవున్నా లేకపోయినా సాహితీ లోకంలో పరిచయం సమానంగా వుండాలి. వారి వారి రచనా వైశిష్ట్యంవల్ల పాఠకుల గౌరవం పొందుతారు. 'గారు' ప్రయోగించటం తప్పు అనటం లేదు. అందువల్ల ఆధిక్యంగానీ అవాధిక్యంగానీ వస్తుందనటం లేదు. అయినా ఇంత ఉత్తమ సాహితీసంస్థకు ఒక పదతి అవసరం. ఒక రచయిత్రిని వ్యక్తిగా పరిచయం చేసేటప్పుడు చూపే గౌరవ విధానం మరో రచయిత్రికికూడా వర్తించాలి. రచయిత్రులుగా వాళ్ల అర్హత ఎటువంటిది అయినా, సంఘంలో వాళ్ల గౌరవం ఎంతటిది అయినా, వ్యక్తులుగా వాళ్లు సమానులు. ఆ సమానత వ్యక్తం కావాలి. వ్యక్తి వ్యక్తికీ వ్యక్తిగా విలువలు నిర్ణయించే వ్యత్యాసపు పద్ధతి ప్రకాశకులు మార్చుకొంటారని పాఠకులు ఆశిస్తారు.

శ్రీమతి రేవనూరి శమంత రచనలలో అర్థంకాని ఆవేదన, తపన, తపస్సు గోచరిస్తాయి. ఆశకు అవధీ పరిధీ కనిపించక, నిరాశతో గుండెలు నింపుకొంటే అక్కడా అనంతత్వం అయోమయత్వం ఎదురై బాధపడి పోతాయి పాత్రలు.

జీవితానికి ఒక అర్థం, ప్రేమకు ఒక నిర్వచనం, పెళ్లినిగూర్చి ఒక నిశ్చితాభిప్రాయం ఏర్పరుచుకోవాలని పాత్రగతంగా రచయిత్రి చేసిన ప్రయత్నం స్పష్టంగా రూపొందలేదు. అలా రూపొందక ఒక పరిధికి అతీతంగా మిగిలి వుండటమే వాటి గుణం!

ఈ వాటి యువతీ యువకులయిన రచయితలు, రచయిత్రులు సాధారణంగా వెలికి రాలేని అవ్యవస్థనుంచి ఈ రచయిత్రి రావాలని ప్రయత్నించినా ఫలితం కథలలో కనిపించలేదు.

ఈ కథలన్నింటిలో రచయిత్రి కథ నడిపించటంకంటే పాత్రల మనోగత భావాలరూపం లేఖలవలననో, చెప్పటం వలననో, అనుకోవటం వలననో వ్యక్తం చేస్తాయి. అందువల్ల పాత్రం హృదయం పాఠకులకు చాలా సన్నిహితంగా వస్తుంది. పాత్రలో పాఠకులు లీనమయిపోయే అవకాశం వుంది.

కథాశిల్పం దృష్టితో వాస్తవికతా భావంతో పరిశీలిస్తే ఇందులో చాలా రచనలు కథలు కావు. కథలలో బలహీనమయిన సన్నివేశాలు తొలగిపోతే బాగుంటుంది. కొద్దిమాటలతో పూర్ణభావస్ఫూర్తి కలిగే పరిస్థితి వుండగా ఎక్కువ పదాలు వాడటం అనవసరం! వాక్యాలు సాగలాగటం తగ్గిస్తే పాఠకులకు విసుగు తగ్గుతుంది.

ఈనాడు వస్తున్న సినిమాల ప్రభావం రచయిత్రిపై వుంది. ముఖ్యంగా హిందీ సినిమాలు. కథ అల్లటంలో, సంభాషణలు నడిపించటంలో ఆ ప్రభావం పాఠకులు గుర్తిస్తారు.

ఈ రచయిత్రి కథలతో కొంత పరిచయం ఉన్నతర్వాత, కొన్ని డజన్ల కథలలో రచయిత్రి కథను పాఠకులు పోల్చుకొంటారు. ఈ రచయిత్రి మాత్రమే ఇలా వ్రాసే అవకాశం వుందనిపించే ఒకానొక వ్యక్తిగత ముద్ర ప్రతి కథలోనూ కనిపిస్తుంది. ఒక కథ కొంతవరకు చదివి తర్వాత ఏమవుతుందో కొంతలో కొంత పాఠకులు నిర్ణయించుకోవచ్చు. ప్రతి కథ ముగింపులో వ్యక్తమయ్యే అల్మియటా విధానం ఒక్క విధంగానే వుంటుంది.

రచయిత్రిలో నిరాశావాదం ఉన్నట్లు కథలు చదివి పాఠకులు భావించే అవకాశం వుంది. అది నిజం కాదు. ఆశావాదమే వుంది. ఆశావాదం అవకాశంగా తోచక, భయంవల్ల నిరాశావాదం తొంగిచూస్తుంది, గాని, రచయిత్రి నిరాశావాదికాదు. ఆశావాది. విషాదాంత రచనా విధానంకూడా ఆశావాద విజయంకోసం వచ్చిన నిరాశావాదమేకాని తదన్యం కాదు. తన కీది కావాలని అంటే అత్యాశ అని అనుకొంటారేమోనని

ప్రదర్శించే నిరాశ ప్రత్యక్ష మవుతుందికానీ, నిజంగా నిరాశ కాదు !

ఈనాడు కథలు వ్రాస్తున్న రచయిత్రులలో చాలామంది వ్రాయలేని సలక్షణమయిన, చక్కని వ్యావహారికం శ్రీమతి రేవమూరి శమంత వ్రాయటం గమనించిన పాఠకులు సంతోషపడతారు. చాలా వాక్యాలు ఎంతో కవితాత్మకంగా గోచరిస్తాయి.

కథా పథకం, సంఘటనలు, సంభాషణలు వాస్తవికతకు దూరంగా ఊహాలోకాల వ్యవహారాలు లాగా వుంటాయి. పాత్రచిత్రణమాత్రం విశిష్టత! సర్వసామాన్యంగా ఒకవిధమయిన అనాలోచిత జీవితం జీవించే స్త్రీలను చక్కగా ఈ కథలలో చిత్రించటం పాఠకులు గమనిస్తారు. స్త్రీ హృదయపు లోతులు తెలుసుకోవటానికి పాక్షికంగా ఈ రచనలు ఉపయోగ పడతాయి.

ఊహాలోకాలలోంచి, వాస్తవిక జగత్తులోకి వచ్చి, సంభాషణలో, ఆలోచనలో కవిత్వ పద్ధతి తగ్గించి, వస్తువైవిధ్యం సముపార్జించి దర్శించిన జీవిత చిత్రణకు అలంకారాలు పులమకుండా, యథాతథంగా చిత్రించటానికి ప్రయత్నిస్తే, జీవితంమీద ఒక సక్రమమయిన నిశ్చితాభిప్రాయం ఏర్పరుచుకోబోయే ఈ రచయిత్రి మంచి కథాసృష్టి చేయవచ్చు. ఆంధ్రసాహితీలోకంలో ఉజ్జ్వల భవిష్యత్తు ఆర్జించవచ్చు.

—మనోరాణి.

## అ గారి కథలు

[కథల సంపుటి. రచయిత్రి: శ్రీమతి భానుమతీ రామకృష్ణ. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో., మద్రాసు, మచిలీపట్టణము, సికింద్రాబాదు. ప్రాప్తిస్థానం: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు. రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు. పేజీలు 139. వెల రూ. 2-50.]

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు సృష్టి 'కాంతం' తో శ్రీమతి భానుమతీ రామకృష్ణ సృష్టి 'అత్తగారు' ను 'రసజ్ఞులు పోల్చి చూచుకొనవలసిన అవసరం ఎంతైనా వుందని' ఈ సమీక్షకర్త అత్తగారి కథలు మొదటి సంపుటి ఆంధ్రపత్రికలో సమీక్షిస్తూ చేసిన సూచన సోదర సమీక్షకులు ఇతరేతర పత్రికలలో ఆ అభిప్రాయం బలపరచటం, ప్రకాశకులు స్వీకరించటం ముదావహం.

ఈ సంపుటిలో 'ఈ 'అత్తగారు' మన కథా సాహిత్యంలోని కాంతం, గిరీశం, బుచ్చమ్మ వగైరా పాత్రలవలె మరుపురాని మహాపాత్ర' అని ప్రకాశకుల ప్రకటన ! ప్రకాశకులు 'మా మాట' లో ఎన్ని 'మహా' లు వాడారో చూచిం తర్వాత, మహాపాత్ర అనటం మాటవరుసకు మాత్రమేనని పాఠకులు గమనిస్తారు.

'అత్తగారు' 'కాంతం'వంటి పాత్ర అని అంగీకరించటం సంస్థ ఔన్నత్యానికి నిదర్శనమే అయినా, అత్తగారు పాత్రను గిరీశం, బుచ్చమ్మలతో పోల్చటం అత్తగారు పాత్రకు అపచారం. అంతేకాదు. 'కాంతం' పాత్రకు మహాపచారం. 'కాంతం' 'అత్తగారు' బహుకోణాలనుంచి దర్శించబడి, చిత్రితమైన పాత్రలు. గిరీశం, బుచ్చమ్మలు ఒక వస్తువును వ్యక్తం చేయటానికి ఒక నాటకంలో సృష్టింపబడిన పాత్రలు. 'కాంతం, అత్తగారు'ల విస్తృతి, గిరీశం బుచ్చమ్మలకు లేదు. ఈ పాత్రలతో పోల్చటంవల్ల, 'అత్తగారు'కంటే శ్రీమతి భానుమతీ రామకృష్ణకు చేసే అన్యాయం ఎక్కువ. రచయిత్రికి అత్యధిక గౌరవం ఇవ్వాలంటే 'కాంతం'లాగా 'ఎంకి'లాగా 'అత్తగారు' కలకాలం నిలిచే పాత్ర అనవచ్చు.

'కాంతం'ను భార్యగా శ్రీ మునిమాణిక్యం నరసింహారావు కలం చిత్రించింది. 'అత్తగారు'ను అత్తగారుగా శ్రీమతి భానుమతీ రామకృష్ణ కలం తిలకించింది. ఒక తెలుగు వ్యక్తిని పై ఇద్దరు రెండు దశలలో చిత్రించారు. అలా చిత్రించే తీరుతెన్నులు చూపిన వ్యక్తి, శ్రీ మునిమాణిక్యం నరసింహారావు. ఆ తెలుగు స్త్రీని బాల్యదశలో, యౌవనదశలో పరిశీలించి వూహించి మరో వ్యక్తి చిత్రించవచ్చు. ఆ చిత్రించటం కూడా, శ్రీమతి భానుమతీ రామకృష్ణ కాంతం అడుగుజాడల్లో 'అత్తగారు'ను చిత్రించిన నేర్పుతో చిత్రిస్తే అప్పుడా మూడు పాత్రలు కలిసి ఒక తెలుగువ్యక్తి సంపూర్ణ జీవితం చూపుతాయి. ఆ మూడు పాత్రల ఏకీకృతరూపమును చూచి పాఠకులు ఇది ఒక మహాపాత్ర అనుకొంటారుగాని, శ్రీమతి భానుమతీ

రామకృష్ణ చిత్రించిన 'అత్తగారు' మహాపాత్ర అనుకోరు. 'కాంతం'ను అనుకరించి 'అత్తగారు'ను సృష్టించిన కీర్తి శ్రీమతి భానుమతీ రామకృష్ణకు లభ్యమవుతుంది.

రచయిత్రికి తనపాత్రలపై సానుభూతి అత్యవసరం. ఏ రచయితకయినా తన పాత్రలమీద సానుభూతి లేకపోవటం తన బిడ్డలమీద ప్రేమ లేకపోవటంతో సమానం. పాత్రలను దయనీయావస్థలో వుంచి, పాఠకలోకాన్ని సంతోషించమని, తనూ సంతోషించటం దారుణం. ఆ స్థితి పాఠకులు 'పర్సనాలిటీ' లో చూస్తారు. ఆ కథలో వాస్తవికత లేదు. 'అంతకు తగ్గ బొంత' ఎక్కడయినా దొరుకుతుంది. వాస్తవికతలేని హాస్యం నాలుగు కాలాలు నిలవదు.

అన్ని కథలకు అత్తగారు పేరు జోడించే పద్ధతి పర్సనాలిటీలో మారిపోయింది. 'అత్తగారూ—పర్సనాలిటీ' అని కథ పేరు అయితే, అదెక్కడి అత్తగారి పర్సనాలిటీ అని పాఠకులు అనుకొంటారో అని రచయిత్రి సందేహమయితే, అత్తగారూ - కూర్మావతారం కథలో అత్తగారిది కూర్మావతారం అని పాఠకులు అనుకొనే అవకాశం వుందని రచయిత్రి భావించక పోవటం విచిత్రమే! రచయిత్రి మళ్లీ ఆలోచించుగాక! పర్సనాలిటీ అంటే శారీరకంగానే అనే రచయిత్రి భావం, వ్యుత్పత్తి విహీనతను తెలుపుతుంది.

'అత్తగారూ—సరసమ్మాయణం'లో అత్తగారి వ్యక్తిత్వంకంటె సరసమ్మ అలవాటు ముదిరిన పాకంలో నడిచిన కథ బాగుంది. ఎన్నో ఏళ్లుగా వంటపని చేస్తున్న వాడికి బాదంకీరు చేయటం తెలియదనటం హాస్యంకోసం కాకపోతే అబద్ధం.

మొదటి సంపుటిలో లాగానే, ఈ సంపుటిలోనూ అత్తగారు చేసిన ఎన్నో పనుల్లో నవ్వులు ఎన్నో—బాగా నవ్వుకోవచ్చు. ఈ సంపుటి అంతా చాలావరకు నవ్వులాటగా వుంది.

పాఠకులు వాస్తవికతా దృష్టితో ఈ కథలు చదివినా ఈ సంఘటనలో వాస్తవం ఎంతవరకు అని ఆలోచించినా హాస్యం కోల్పోతారు. హాస్యసిద్ధికోసం వాస్తవిక దృక్పథం చంపుకోవాలి.

'అత్తగారూ—కూర్మావతారం' 'అత్తగారూ—అంకె బిందెలూ' మినహాయించితే మిగిలిన రచనలు రచనలు మాత్రమే! కథలుకావు. హాస్యరచనలు. నవ్వించే రచనలు. నవ్వులపాలయ్యే రచనలు.

పై రెండు రచనలు కొంతవరకు అసహజంగా వున్నా, హాస్యం సహజంగా తొంగిచూచే పద్ధతికి కొంతపులుముడు అధికమే అయినా, కథాశిల్పం దృష్టితో చక్కని రచనలు. ఈ కథానికలవల్ల రచయిత్రి సాహితీ జీవితం కాంతివంతమవుతుంది.

ఆంధ్రులకు హాస్యప్రియత్వం అధికం అన్న సంగతి జగత్తెరిగిన సత్యం. ఈ రచనలలోని హాస్యం చూచి ఆనందిస్తున్నారాంధ్రులు అని తెలిస్తే, హాస్యంకంటే రచయిత్రి అపహాస్యం చదివేసని తెలుస్తుంది.

రచయిత్రి స్వీకరించిన వస్తుగౌరవంచేత, హాస్యం రసరూపం దాల్చే అవకాశం లేకపోలేదు. ఆ పాత్రలపట్ల సానుభూతి కోల్పోయినా హాస్యదృష్టి పాఠకులకు తగ్గిపోదు. పాత్రగత హాస్యస్థితి చక్కగా పోషించుకుంటూ రచనచేస్తే చక్కని హాస్యరచనలు తయారవుతాయి; కానీ అంత జాగ్రత్త రచయిత్రి వహించటం లేదన్నది ఈ కథలు చదివాక పాఠకులు తెలుసుకొంటారు.

హాస్యోత్పత్తికి రచయిత్రి సృష్టించే హంగులు కొన్నిపాత్రలు. ఆ పాత్రలపాట్లు చూడకుండా అనాలోచితంగా నవ్వుకోవటమే మిగులుతుంది.

మొదటి సంపుటిలో 'అత్తగారు' రెండో సంపుటిలో 'అత్తగారు' అన్నివిధాలా ఒకే విధంగా వున్నట్లు కనిపించినా, నిజంగా 'మొదటి' అత్తగారు ఉన్నంత అందంగా ఆనందంగా 'రెండో' అత్తగారు లేదు. వైవిధ్యమూ తిరోగమనంలో వుంది. అయితే కథా కథనం, శిల్పదృష్టితో ఈ సంపుటిది పురోగమనమే!

అత్తగారు జీవితం చాలా పరిమితమయింది. కొడుకూ, కోడలూ, మనుమలూ, ఇంట్లో పని వాళ్లూ, వాళ్ల సంసారాలు, ఇంటికి వచ్చిపోయేజనం ఇంతమాత్రమే ఆమెకు తెలిసిన లోకం. కాకపోతే బాల్యంలో తెలిసిన 'ఉద్దు'దారలాంటి ఏ కొద్ది

మంది తప్ప, ఇతర ప్రపంచం ఆమె కందుబాటులో ఉండదు. అత్తగారు పరిధి నతిక్రమించకుండా రచన చేయటంపట్ల రచయిత్రి కృషి సఫలమయింది.

రచయిత్రి ఏనాడయినా అత్తగారిని కనీసం ఢిల్లీదాకా తీసుకుపోయి తిరిగి తీసుకువస్తే ఈ మధ్యలో అత్తగారు అల్లుకుపోయే కథలు కోకొల్లలు. ఈ సూచన రచయిత్రి పాటిస్తే వైవిధ్యం తయారవుతుంది. క్రొత్తవిధంగా కథలువచ్చే అవకాశం వుంది. పాఠకులు అత్తగారు కథలలో వైవిధ్యం కోసం ఎదురుచూస్తున్నారు.

మంచి కాగితాలమీద, చక్కని బొమ్మలతో ముచ్చటగా ముద్రించి వెల తక్కువకు పుస్తకాలు అందరికీ అందుబాటులో వుండేలా చేస్తున్న యం. శేషాచలం అండ్ కో సంస్థ మరింత మంచి రచనలు అందివ్వాలని పఠితలోకం ఆశిస్తుంది.

## అర్ధాంగి

(నవల. రచయిత్రి: శ్రీమతి ఉన్నవ విజయలక్ష్మి. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ, పేజీలు 140. వెల రూ. 2—00.)

అర్ధాంగి ఎవరని ప్రశ్నించుకొంటే జవాబుగా ఈ నవలలో ఇద్దరు స్త్రీలు కన్పిస్తారు. పద్మావతి, అపనిందల పాలై భర్తకు దూరమై, ఎన్నో కష్టాలు ఎదుర్కొని చివరిదాకా భర్తకోసమే త్యాగమయిగా నిలచిన శీలవతి. జానకి పెళ్ళిచేసుకోకుండా కాపురంచేస్తూ డబ్బుకూడగట్టుకొని, భర్తవంటివాడు మంచంపడితే కర్మకు వదిలి కఠినత్వంతో వెళ్ళిపోయిన స్త్రీ! వీళ్ళిద్దరూ నవలలో భార్యలు! ఎవరు అర్ధాంగి? నిజమయిన అర్ధాంగి, పద్మావతిగా, నకలు అర్ధాంగి జానకిగా రచయిత్రి అభిప్రాయం అయివుంటుంది.

ఈ నవలలో హీరో డాక్టర్ హరీష్ కుమార్. హీరోయిన్ మంజుల. విలన్ శంకరం. తల్లిదండ్రుల గత చరిత్ర తెలియకపోయినా హీరోకి పెద్ద హిస్టరీ వుంది. ఆమెకు తెలియని గతం హీరోయిన్‌కు కూడా చాలా వుంది. తండ్రి కాని తండ్రికి తనయుడుగా మసలుకొంటున్న శంకరం చెప్పని కథ కొంతవుంది. కాబట్టి ఈ ముప్పాత్రం ముప్పేటల నవల పాఠకుల్ని మూడు చెరువుల నీరు తాగిస్తుంది. ముప్పతిప్పలు పెట్టదు.

సుదర్శనంపట్ల జాలి కలుగుతుంది. దిగులు పుడుతుంది. కోపం వస్తుంది. శంకరంమీద పాఠకులకేమీ కోపం రాదు. పాపం అందరిలాటి వాడే అనిపిస్తుంది. జానకి ప్రవర్తనకు అర్థం తెలియదు. తెలిసిందనిపించేది సహజతకు దూరంగా వుంటుంది. పద్మావతి సామాన్య స్త్రీలాగా కనిపించి అసామాన్య స్త్రీలాగా మారిపోతుంది. హరీష్ లోకం తెలియని డాక్టర్. అదోరకం యువకుడు. మంజులపాత్ర తప్ప ఇతరపాత్ర సృష్టి సమగ్రంకాదు. రచయిత్రి తన యిష్టం వచ్చిన కోణంనుంచి చిత్రించిన తీరు పరికించి, అసంపూర్తి చిత్రాలు తిలకించినట్లు పాఠకులు అనుభూతి చెందుతారు. ఉన్నంతలో మంజులపాత్ర సమగ్రత సాధించుకొంది.

కథలో ప్రత్యేకత ఏమీ లేదు. సుదర్శనం పెళ్ళి, భార్యను వెళ్ళగొట్టటం, మరో స్త్రీ చేరదీయటం కష్టాలు పడటం ఒక భాగం; భర్త్య పరిత్యక్త అదృష్టం వెతుక్కొంటూపోయి, మహోత్తమ జీవితం లభిస్తే హాయిగా వుండటం మరో భాగం; యువతీ యువకుల ప్రేమ, అవాంతరాలు పరిష్కారం లభించటం ఇంకో భాగం. ఇలా మూడు భాగాలు ఏకమయి రూపొందిన నవల అర్ధాంగి.

రచయిత్రి చూపిన నేర్పు కథా కథనంలో ఏమయినా ఉందేమోనని పాఠకులు ప్రయత్నించనక్కరలేదు. ఎందుకంటే కథ ఎలా అతుకుల బొంతో అలాగే కథనం. వర్తమానంలోని కథ ఆకస్మికంగా గతంలోకి పరుగులు తీస్తుంది. భూతం పెనుభూతంలా ఎదురయ్యేసరికి పాఠకులు వర్తమానం మరచిపోవచ్చు. భూతవర్తమానాలలో అటూ ఇటూ పరుగులు తీసే నవల అర్ధాంగి. పాఠకుల మనస్సులలో చెరిగిపోని ముద్ర వేయలేదు.

ఒక పాత్ర చూడని, వినని విషయాలు వ్యక్తం చేయవలసిన అవసరం ఈ నవలలో చెప్పవలసి రాకపోలేదు. ఒక పాత్రకు ఎన్నో ఏళ్ళనాడు జరిగిన సంగతి అంతా గుర్తు వుండవచ్చు. ఆ సందర్భంలో

జరిగిన సంభాషణ సారాంశం గుర్తు వుండవచ్చు. కానీ సంభాషణ యథాతథంగా గుర్తు వుండటం వాస్తవానికి దూరం. అటువంటి అవాస్తవికతకు అర్ధాంగి అపవాదం కాదు.

జానకి ఆ పరిస్థితుల్లో భర్తను వదిలి పోతుందా, ఆపైన ఆమె ఏమయింది, శంకరం మంజు లను ఆ విధంగా మాట్లాడుతాడా, పద్మావతి ధనవంతు రాలుగా మారిపోయిన తీరు వాస్తవంగా వుందా, వంటి అనుమానాలు పాఠకులకు నిస్సందేహంగా కలుగుతాయి. వీటికే కాదు. ఇటువంటి చాలా ప్రశ్నలకు నవలలో సమాధానాలు దొరకవు. అందుకే అర్ధాంగి సమాధానా తీత నవల.

హోటల్‌లో శంకరం ప్రేయసితో మాట్లా డిన మాటలు ప్రక్కగదిలోవున్న హరీష్ మంజులలు వినటం నాటకీయంగా వుంది. అందరూ త్యజించాక సుదర్శనం అసహాయస్థితిలో మంచంమీద పడి వుండటం దయనీయంగా వుంది. ఇంతకంటే విశిష్టంగా బలవత్తరంగా కనిపించే సన్నివేశం నవలలో లేదన వచ్చు.

ప్రతిసంఘటనా, ప్రతిపాత్రా అంతా అదో తరహా సినిమా లోకంలోలాగా కనబడే స్థితి దాట లేదు. వాస్తవికతకు అర్ధాంగి సుదూరంలో వుంది. రచయిత్రిగా శ్రీమతి ఉన్నవ విజయలక్ష్మి బాల్య దశకు ఈ రచన నిదర్శనం. రచయిత్రి కలంనుంచి వెలువడిన రచన కాబట్టి పాఠకులు చదువుతారు. తాత్కాలికంగా ఆనందం పొందుతారు.

## పరిష్కారం

[కథల సంపుటి. రచయిత: శ్రీ జి. వెంకట రామారావు. ప్రతులకు శ్రీ జి. వెంకటరామారావు. ఇబ్రాహింపట్నం తాలూకా, హైదరాబాద్ జిల్లా. పేజీలు 139. వెల రూ. 2—00.]

వ్యక్తిగతమూ, భావగతమూ అయిన అయిదు ఇతివృత్తాలకు కథాకల్పనం చేసిన రచయిత శ్రీ జి. వెంకటరామారావు కథలు వ్రాయాలనే ఉత్సాహంతో పాఠకులకు పుస్తకం అంతటా కనిపించే తీరు అదోవిధంగా వుంటుంది.

'పరిష్కారం' చదవటానికి ఎక్కువ సమయం పడుతుంది. 'ఇది ఎలాటి త్యాగం' చదివి ఆలోచించ గానికి కొంచెం సమయం కావాలి.

'పరిష్కారం'లో ముగింపు అలానే ఎందు కుండాలో రచయిత తేల్చి చెప్పలేదు. మరోవిధంగా వుంటే బాగుండేదేమోనని భావించే అవకాశం వుంది.

ఆ రచనవల్ల రచయిత సాధించింది ఏమీ కని పించనప్పుడు ఇంత 'పెద్దకథ ఎందుకు వ్రాయవలసి వచ్చిందా' అనిపిస్తుంది.

మోహన్ చనిపోవటంలోని అంతర్యం అర్థం కాదు; సనజ మానసికతృప్తి సర్వంవల్లనా, సాను తివల్లనా అని పాఠకులు ఆలోచించవచ్చు.

'అభిమానం' దురభిమానం. ఆ కథ విషాదాంతం కావలసిన అవసరం లేదు.

'కాలాతీత వ్యక్తి' అనుహవానికి నిదర్శనం.

'ఏప్రిల్ ఫూల్' కనువిప్పు—అయోమయానికి అర్థం అంతే!

భాష బాగా వుండాలని రచయిత తాపత్రయం బాధ కలిగిస్తుంది.

ఈ కథలు అభ్యాసప్రాయంగా పాఠకులు భావిస్తారు.

ఎక్కడో ఒకటి రెండు చక్కని సన్నివేశాలు. కొద్దిగా మంచివాక్యాలు, అంతో ఇంతో పాత్రచిత్ర ణలో నేర్పు, కథాకథనంలో ప్రసిద్ధకథకుల తీరు తెన్నులు ఉన్నంతమాత్రాన, ఈ కథలు చదివినవాళ్ళు తృప్తిపడతారనే అవకాశం లేదు.

ఈ రచయిత ముమ్ముందు పాఠకుల ఆదర పాత్రమయ్యే రచనలు చేయవచ్చునేమోనని ఆశింప వచ్చు.

—'రవి'

## సాహిత్యము - ఉద్దేశము

(రచన : ప్రేమ్‌చంద్ ప్రచురణ, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, ఏలూరు రోడ్డు —విజయవాడ—2. 162 పేజీలు; వెల : రు 2—50.)

విశ్వవిఖ్యాత మహారచయితలలో టాల్‌స్టాయీ, ప్రేమ్‌చంద్‌లు ఒక కోవలోని వారు. సాహిత్యంలో

నైతిక విలువల ప్రాధాన్యాన్ని గుర్తించి, తమ రచనా శిల్పం కుంటుపడనీయకుండా తీర్చి దిద్దుకున్న మహారచయితలు వారు. వారి రచనలెప్పుడూ నీతి శాస్త్రాలు కావు. అలాగని అవినీతిని ప్రోత్సహించటం కలలోనైనా వారెరుగరు. తెలుగు పాఠకులు గొప్ప నవలాకారునిగా, కథకునిగా మాత్రమే ప్రేమ్‌చంద్‌ని యెరుగుదురు. ఇప్పుడు ప్రేమ్‌చంద్ విమర్శకునిగా ఎంత ఉత్తమశ్రేణికిచెందినవారో తెలుసుకోగల్గుతారు.

సృజనాసాహిత్యంలోనూ, విమర్శనా సాహిత్యంలోనూ సవ్యసాచులైన వారరుదుగా ఉంటారు. ప్రేమ్‌చంద్ సాహిత్య సిద్ధాంతాలను కూలంకషంగా పరిశీలిస్తూ, తన అమేయ మేధా సంపత్తితో విశ్వవాఙ్మయంలో విహరిస్తూ, ఆంగ్లవాఙ్మయంలోనుండి ఎన్నెన్నో ఉదహరిస్తూ ప్రసంగించేవారు; వ్యాసాలు వ్రాసేవారు. వాటి సారాంశమే యీ పుస్తకరూపం దాల్చింది. అనువాదకులు పేరెక్కడా కన్పించదుగాని అనువాదం ప్రశస్తమైనది. కీర్తివాంఛించ కుండానే ప్రేమ్‌చంద్ ఉత్తమ సముదాయాన్ని తెలుగు పాఠకుల కందించ పూనుకొన్న అనువాదకుల సారస్వతసేవ అభినందించ దగినది. ఆకర్షణీయమైన ముఖచిత్రంతో అందంగా అచ్చువేసిన శ్రీ విశాలాంధ్ర ప్రచురణాలయం వారభినందనీయులు.

సాహిత్యమీనాడు కేవలం రాజాశ్రయమూ పండితైకవేద్యమూ కాదు. కవిత్వానుభూతిని 'అతాడ మన్న మిన్నుల మిటారపు గుమ్మ కమ్మనౌ వాతెఱ దొండ పండువలె వాచవిగావలె పంటనూదినన్' అనటానికి కుదరదు. సాహిత్యవేత్తలందరూ తమ సాహిత్యోద్దేశాన్ని విడమర్చి చెప్పుకోవలసి ఉన్నది. తమ సాహిత్య ప్రయోజనం పాఠక హృదయాహ్లాదమేనని గుర్తించుకొని, రసస్పర్శలేని రచనను త్యజించవలసి ఉన్నది. ఈ విషయాలను ప్రేమ్‌చంద్ సాధికారికంగా చర్చిస్తూ సాహిత్యోద్దేశ్యాన్ని వ్యక్తి నిష్ఠంగాక సామాజిక నిష్ఠంగానే స్పష్టం చేశారు. అవి సారస్వత విమర్శకులకు కనువిప్పుగానూ, పాఠకులు శిరఃకంపం చేసేవిగానూ ఉన్నాయి. తెలుగు సారస్వత విమర్శలోనూ కొత్త వెలుగులు ప్రసరించగలవని తోస్తుంది.

తెలుగు సాహిత్యంలో ప్రతిభావంతులైన విమర్శకులు ఆధునిక కాలంలో ఉన్నా సమగ్రమైన విమర్శ గ్రంథాలు లేవు. ఈ పుస్తకం చిన్నదైనా గుణంలో గొప్పది. సాహిత్యము—ఉద్దేశము; జీవితము—సాహిత్యము; నవలారచన; సాహిత్యము — జ్ఞానవాదము; ఆస్తిక్యనాస్తిక్య సిద్ధాంతాలు; సాహిత్యము—విమర్శ; సాహిత్యము—సినిమాలు; సినిమాలు—జీవితాలు మొదలైన విషయాలను గురించి మంచి ఆలోచనలు రేకెత్తించే విమర్శ వ్యాసాలు యీ పుస్తకంలో ఉన్నాయి. అనువాదంలో మరికొన్ని జాగ్రతలు తీసుకోవటం అవసర మనిపిస్తున్నది. ఉదాహరణకు 'చర్చించుచూ' 'సౌందర్యప్రేమ'వంటి పదాలను దొర్లనీయటం బాగుండలేదు. వ్యావహారికంలో 'చర్చిస్తూ'అని వ్రాస్తే బాగుంటుంది. 'సౌందర్య ప్రేమ' అనే సమాసం ఎబ్బెట్టుగా ఉంటుంది.

'ప్రేమ ఆధ్యాత్మిక ఆహారం, ఈ ఆహారం లభించకపోవుటవలనే అన్ని బలహీనతలు పుట్టుచున్నాయి. కళాకారుడు యిందులో సౌందర్యానుభూతిని ఉత్పత్తిచేస్తూ ప్రేమోష్ణతను మిళితం చేస్తాడు' అని సౌందర్యానికీ ప్రేమకూ ఉన్న గాఢమైన అనుబంధాన్ని వర్ణిస్తారు. మరి ప్రేమ ఆధ్యాత్మి ఆహారమైనట్లే కవికి కవితాప్రకటన ఆత్మకు ఆహారం అనవచ్చు ననుకుంటాను. హృదయగతమైన భావాలను వెలువరించే సమయంలో కవికి సమాజం జ్ఞాపకం ఉండదనుకొంటాను. కవి ఋషిమాత్రుడు, క్రాంతదర్శి కావటంచేత సమాజమే అతడిని అనుసరిస్తుంది. అందుచే "Poets are the Unacknowledged Legislators of the World" అనటం జరిగింది. ప్రపంచాన్ని తీర్చిదిద్దే నైతికబాధ్యత ఉన్న కవులు, మరి నైతిక విలువలను విస్మరించి అవినీతిని ఆకర్షవంతంగా చిత్రిస్తే వారు శిక్షార్హులు. కవులు అవినీతిని వర్ణించరాదని కాదుగాని ఆకర్షవంతంగా అనుసరణీయంగా వర్ణించకూడదు. ప్రేమ్‌చంద్ యీ విషయాలను వెల్లడిచేస్తూ నైతిక విలువల ఉద్ధరణను ఉటంకించారు. 'మనుష్య జీవితంలో వున్న రహస్యాలను తెలుసుకోవాలంటే సంఘర్షణలో తప్ప మరెక్కడా లభించవు' అని ఇక్బాల్ కవి చెప్పారు. సంఘర్షణలో జీవిత రహస్యాలను గమనించిన కవి

ఆదర్శవాదం వేపు సమాజాన్ని నడిపించాలిగాని అధోగతికి కాదు. ఈ విషయంలో ప్రేమ్‌చంద్ వాక్యాలు చూడండి. 'మన కళలన్నీ యవ్వనపు ఉన్మత్తతలో మునిగి తేలుచున్నాయి. యవ్వనపు హృదయంమీద తలవుంచి, కవిత్వం చెప్పటంవలనగాని శృంగారనాయిక అస్వాభావిక విషయాలను గూర్చి రోదించటంవలనగాని లేక ఆ నాయిక రూపగర్వాన్ని మత్తెక్కిన కన్నులలో చూపటంవలనగాని కళ ఉద్దేశము నెరవేరదు. ఆ యవ్వనపు ఆవేశం ఆదర్శవాదానికి, ధైర్యానికి, కష్టాలను ఆహ్వానించటానికి, ఆత్మత్యాగానికి మాత్రమే ప్రతిబింబంగా వుండాలి' సాహిత్యంలో క్రియాశక్తి లోపించటం నైతిక విలువలు దిగజారడానికి కారణంగా పేర్కొంటున్నారు.

'మనస్సాధన, సౌందర్యారాధన, తత్వజ్ఞానం నిగ్రహం మొదలైన వాటిని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి. సాహిత్యకారుడు ఎప్పుడూ ఆదర్శవాదిగా వుండాలి. భావాలను గూడ పరిమార్జితంగా వుంచాలి. మన సాహిత్యవేత్తలు యీ ఆదర్శాలను కలిగివుండకపోతే మన సాహిత్యం శుభం చేకూరుస్తుందనే ఆశ వుండదు.' సుస్పష్టంగా వ్యాఖ్యాన నిరపేక్షితాలైన యిటువంటి వాక్యాలు సాహిత్యంలో వెలుగును ప్రసరింపజేస్తాయి.

సాహిత్యకారుడు రైతునుగాని, కార్మికుణ్ణిగాని, లేదా విప్లవాన్నిగాని తీసుకొని 'ప్రాపగాండా' చేయకూడదంటారు ప్రేమ్‌చంద్. ఈ విషయంలో మాత్రం ఏకీభవించటం కష్టం. బోల్షివిక్, ఫ్రెంచి విప్లవ దినాలలో కార్మిక, కర్షకుల నుద్దేశించి వ్రాసిన గోర్కీ, పుష్కిన్, గోగోల్, ఛెకోవ్, టాల్‌స్టాయ్, వాల్టేర్, రూసోలందరూ విప్లవాన్ని సమాజంలో అణగారి పోయిన ప్రజల గురించి ఆక్రోశిస్తూ, విప్లవాన్ని 'ప్రాపగాండా' చేసిన వారే. అంతే కాదు భారత స్వాతంత్ర్య సమరాన్ని 'ప్రాపగాండా' చేస్తూ వ్రాసిన బంకింబాబు, ఇక్బాల్ కవులు మహాకవులు కారా? బెర్నార్డ్‌షా నాటకాలు; వెల్సునవలలు, గాల్సువర్దీ డ్రామాలు, నవలలు; డికెన్సు, మేరీకోరెల్లి, రోమా రోలా, తాల్‌స్టాయ్, చెస్టర్‌టన్, డాస్టవిస్కీ, గోర్కీ, సింక్లెయిర్ మొదలైనవాళ్ళ రచనలన్నీ ప్రాపగాండాతోనూ, సాహిత్యంతోనూ మిళితమయి వుంటాయి. ఆనందానుభూతిని కలిగించేది సాహిత్యం. పైవారి రచనల్లో ఆనందానుభూతి కలిగించే అంశం ఉన్నది గాబట్టి సాహిత్యంలో వాటికి స్థానం ఉన్నదంటున్నారు ప్రేమ్‌చంద్.

మరొకచోట ప్రేమ్‌చంద్ అంటారుగదా! పాఠకుడు అన్నిటిని క్షమించగలడుకాని, రచయితలో వున్న కృత్రిమాన్ని, నటనను, కీర్తిలాలసను మాత్రం క్షమించలేడు. ఈ విషయాన్ని రచయిత లందరూ గుర్తించుకోవటం మంచిది.

'కథానికల విషయంలో ఫ్రెంచి, రష్యన్ సాహిత్యంలో వెలువడ్డ కథలవలె మరి ఏ యితర యూరప్ భాషలోనూ వెలువడలేదు. ఇంగ్లీషులో కూడ డికెన్సు, వెల్సు, హార్డీ, కిప్లింగ్, చార్లట్ బ్రాంటీ మొదలైనవాళ్ళు కథలు వ్రాశారు. కాని అవి మొపాసా, బాల్జాక్, పియార్‌లోటీ కథలతో పోటీ పడలేవు. ఫ్రెంచి కథలలో సరసత ఎక్కువ పాళ్ళలో వుంటుంది. అంతేకాకుండా మొపాసా, బాల్జాక్ మొదలైనవాళ్ళు కథల ఆదర్శాలను తమ చేతులనుంచి బయటకు జారనీయలేదు. వాళ్ళద్వారా అనేక సామాజిక, ఆధ్యాత్మిక పరిస్థితులు పరిష్కరించబడ్డాయి. రష్యన్ భాషలో ప్రజాదరణ పొందిన కథలు ఎక్కువగా టాల్‌స్టాయి వ్రాసినవే. 'చెకోవ్' కూడ చాల కథలు వ్రాశాడు. యూరప్‌లో ఆయనకు చాల కీర్తి కూడ వుంది. కాని ఆయన కథలలో విలాసపూరితమైన జీవితాల చిత్రణతప్ప మరే విశేషత లేదు. డాస్టవిస్కీ నవలలే కాకుండా కథలు కూడ వ్రాశాడు. కాని ఆయన కథలలో మనోదౌర్బల్యాలను ఎక్కువగా చూపాడు. భారతదేశంలో బంకించంద్ర, రవీంద్రనాథ్ ఠాకూర్ మొదలైనవాళ్ళు చాల కథలు వ్రాశారు.' ఈ వాక్యాలను చదివినప్పుడు ప్రేమ్‌చంద్ కున్న బహుభాషా వాఙ్మయపరిచితీ, ఔచిత్యానౌచిత్య చర్చ, ఉత్తమ విలువల స్థాపనగురించి ప్రగాఢమైన నమ్మకా వెల్లడౌతాయి. ఎంతటి విఖ్యాతరచయితలైనా అతడు మార్గం తప్పి శిల్పంలో తన ప్రజ్ఞను ప్రదర్శించినా ప్రేమ్‌చంద్ ప్రశంసించరు. ప్రేమ్‌చంద్ సత్యాన్ని వెల్లడించటంలో వెనుదీయని నిజాయితీపరులు. అందుకే నిస్సంకోచంగా "నవలారచనవలె కథారచనా విధానంకూడ మనం పాశ్చాత్యులనుంచే నేర్చుకున్నామని చెప్పటానికి ఎటువంటి

సందేహము లేదు. దాని వికాసంకూడ పాశ్చాత్య పద్ధతినే జరిగింది' అని నిజాన్ని నిర్భయంగా వెల్లడిస్తారు.

సాహిత్యవేత్తలు లోకప్రియత్వం కొఱకు అఱ్ఱులు చాచకూడదంటారు ప్రేమ్‌చంద్. దీనికి విరుద్ధంగా తాల్‌స్టాయ్ లోకప్రియత్వం కళ యొక్క ఆదర్శం అంటారు. కాని ప్రేమ్‌చంద్ తార్కికంగా "లోకప్రియత్వమే కళ కాదర్శమనుకుంటే 'అలిఫ్‌లైలా' 'కథాసరిత్సాగరం' ఎదుట టాల్‌స్టాయ్ వ్రాసిన 'వార్ అండ్ పీస్', విక్టర్ హ్యూగో వ్రాసిన 'లేమిజరబ్లే' నిలబడలేవు" అని నిర్భయంగా తన అభిప్రాయంలో వ్యక్తిత్వాన్ని వెల్లడించుకొన్నారు. ఈ విధంగా పరస్పర విరుద్ధాలుకాని భావాలతో, సూటిగా చెప్పే సిద్ధాంతాలకు ఉదాహరణలు కొల్లలుగా యిస్తూ పుస్తకమంతా రమ్యమైన సాహిత్య విమర్శతో నింపారు ప్రేమచంద్.

సాహిత్య విద్యార్థులూ, సాహిత్యాభిలాష గలిగిన పరములూ, అస్పష్టమైన విమర్శనా జ్ఞానంతో విమర్శల్ని వెలయిస్తున్న తెలుగు విమర్శక సోదరులూ అవశ్యం పఠించదగినది, కత్తితో కోసినట్లుగాక భుజం తట్టేవిధంగా హెచ్చరించిన ప్రేమ్‌చంద్ మాటలను కవులందరూ శ్రద్ధతో గమనిస్తే, ఎన్నో విషయాలు తెలుసుకోగల్గుతారు.

## సాహిత్య వ్యాసములు

### (ఆంధ్ర కావ్యాలోకము) మొదటి భాగము

[సాహిత్య వ్యాసములు; రచయిత: దర్శనాచార్య కొండూరు వీరరాఘవాచార్యులు, ఆంధ్రోపన్యాసకులు, వి. యస్. ఆర్. కళాశాల, తెనాలి; ప్రకాశకులు: కె. వి. ఆర్. అండ్ సన్స్, తెనాలి; 160 పేజీలు; వెల: రూ. 3—00.]

'సాహిత్యంపై అభిరుచి కల్పించడం, ఆయా కావ్యాదులలోని అందచందాలను వెలికితీసి చూపడం, వాటిపై పాఠకునికి అభిముఖ్యం కల్పించడం—చిన్న పనులు కావు' అంటున్నారు విద్వాన్ విశ్వం శ్రీ వీరరాఘవాచార్యులవారికి యోగ్యతా పత్రమిస్తూ. కాని ఇవి చిన్నపనులు కావేమోగాని సాహిత్యవిమర్శమాత్రం కావు; ప్రాచీనకవుల కావ్యాంశాలను గైకొని, ఒక్కొక్క ఘట్టాన్ని వివరిస్తూ, పద్యాల నుదాహరిస్తూ ప్రశంస చేయటం వ్యాఖ్యాన మనిపించుకుంటుందేమోగాని విమర్శ అనిపించుకోదు. పూర్వవిమర్శకుల పద్ధతికి భిన్నంగా నవ్యులలో శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారూ, శ్రీ అక్కిరాజు ఉమాకాన్తంగారూ కావ్యాలలోని గుణదోషాలను రెండింటిని యుక్తియుక్తంగా చర్చిస్తూ విమర్శించారు. ఆ కోవలో కొందరు విమర్శకులు కావ్యవిమర్శలో కొత్తఅందాలను తెచ్చిపెట్టారు. ఈ పుస్తకంలోని వ్యాసాలలో ఏవొక్కటీ విమర్శనా వ్యాస మనిపించుకోదగనిది. విద్వాన్ విశ్వంగారు చెప్పినట్లు కావ్యాలలోని అందచందాలను వెలికిదీసి, వాటిపై పాఠకునికి అభిముఖ్యం కలిగించటమే వీరి ఉద్దేశ్యం కాబోలు.

సాహిత్య విమర్శలో అవాంఛనీయమైన కవి మతమూ, కులమూ మొదలైనవాటిని గురించి యీ పుస్తకంలో పేర్కొనటం జరిగింది. బాణాల శంభుదాసుడు, కొఱవిపాటి గురవయ్య, సంకుసాల నృసింహకవి విశ్వబ్రాహ్మణులైనంతమాత్రంచేత సాహిత్యానికి వారిగే దేమిటి? కీ. శే. వీరేశలింగము పంతులుగారు కవి జీవితాలను తఱచి చూస్తూ, వాని కులమతాలనూ, శాఖలనూ ఆయా కవుల కాలనిర్ణయం కొఱకు పరిశోధించారు. కవులకు సంబంధించిన కాలనిర్ణయమైనా తాత్కాలికమైన సాహిత్య స్వరూపాన్ని తెలుసుకుండేటందుకే. అంతేగాని పూర్వుడైనంత మాత్రంచేత ప్రజ్ఞాశాలీకాడు, నవ్యుడైనంతమాత్రాన తీసిపోయినవాడూకాడు. అదేవిధంగా కవి కులాన్నిబట్టి కావ్యసౌందర్యానికి విలువ కట్టకూడదు. సాహిత్య విమర్శలో రసానందానికి, రసదోషాలకూ ప్రాముఖ్య మివ్వాలి.

ఈ పుస్తకంలో తొమ్మిదివే వ్యాసాలున్నాయి:

ఏ వ్యాసమూ వాటి శీర్షికలతో ఆలోచించి చూస్తే సమగ్రమూ కాదు, సుందరమూ కాదు. మొదటి వ్యాసం 'కావ్యమీమాంస.' ఈ పేరుతో ఉన్న అలంకార శాస్త్రానికిది వ్యాఖ్యానవ్యాసం కాదు. కావ్యప్రయోజనము, కావ్యాత్మ, కావ్యమూ, ప్రబంధమూ మొదలైన విషయాలను గూర్చి పర్యాలోకన చేసినది. విద్యార్థుల కుపయోగించునదిగా సంక్షిప్తముగా యీ వ్యాసమును వ్రాశారు. అగాధమైన కావ్యస్వరూపాన్ని వివరించటంలో వీరి కృషి మెచ్చదగినది. ఈ వ్యాసంలో ఒకచోట నన్నెచోడుని పేరును స్మరింపకనే పూర్వకవిస్తుతి చేసిన తిక్కన సోమనల కులతత్వాన్ని ప్రస్తావిస్తూ 'ఆహా! కులతత్వ మహిమ!' అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు. ఈ విధంగా కులతత్వాన్ని గర్హించటం మెచ్చదగిన విషయమే. కాని వారీ విషయాన్ని బాణాల శంభుదాసు, కొఱ్ఱపాటి గురువయ్యలను గుఱించి వ్రాస్తున్నప్పుడు గూడ పాటించి ఉంటే బాగుండేది.

'ఆంధ్రసాహిత్యముపై మతప్రభావము' అనే వ్యాసములో మత ప్రభావాన్ని సరిగా వివరించనేలేదు. స్వల్పమైనా ఆంధ్రసాహిత్యముపై మహమ్మదీయ, బౌద్ధ, క్రైస్తవమత ప్రభావాలను గుర్తించనే లేదు. అల్లసాని పెద్దన కాలంనాటికే చంద్రదూషణలో కూడ 'తురకల దైవంబ వీవు' అని దూషించేటంత మత వైషమ్యం ఉండేది. మన సాహిత్యంలో శైవ, వైష్ణవమతశాఖల ప్రభావాన్ని స్పృశించి వదిలేరు. అక్కడకూడ శివకవులు దేశి సారస్వతానికీ, దేశియ ఛందస్సులకు ప్రాణంపోసిన విషయం అంతగా పట్టించుకొన లేదు. వైష్ణవ మతప్రభావాన్ని పొందిన శ్రీకృష్ణదేవరాయలతోపాటు వీరవైష్ణవులైన విజయరాఘవనాయకునివంటి వారినిగూడ పేర్కొననేలేదు. శైవ, వైష్ణవ సంఘర్షణల కాలవాలమై, దేశియ ఛందస్సులో మహాకావ్యమైన 'పల్నాటి వీరచరిత్ర' వైశిష్ట్యమే మఱుగుపఱచారు. ఇక అధునిక కాలంలో బుద్ధచరిత్ర; సౌందరనందము వంటి బౌద్ధమత ప్రభావాన్ని పొందిన కావ్యాల మాటేమిటి? 'మత వ్యామోహముచేత కావ్యమునకు అతకని విషయములను కథలను అందు పొందుపఱచుటచే కావ్య సౌందర్యములుప్తీభూతమగుటకొన్నికావ్యముల విషయమున మన మెఱుంగుదుము. ఆ విషయము ఈ వ్యాసములో నిరూపింపబడలేదు' అన్నారు. మఱి 'ఆంధ్ర సాహిత్యముపై మత ప్రభావము' అను విషయములో నిరూపించిన దేమిటి? 'మత ప్రభావము కవులమీద పడుటవలన కొన్ని కావ్యములలో కావ్యధర్మమునూ, ఔచిత్యమూ లోపించుట సంభవించినది' అని చెప్పారు గదా! ఈ అనౌచిత్యములనే మరి కొన్ని వివరాలతో, ఉదాహరణలతో వివరిస్తే బాగుండేది. 'మత ప్రభావమువలన కావ్యసౌందర్యము చెడకుండ చూచుకొనుటయే ఉత్తమోత్తమ కవీశ్వరుల ధర్మము'—భేషైనమాట చెప్పారు.

'మన్మథపత్ని' అనే వ్యాసంలో కాళిదాసుని కుమారసంభవములోని రతీదేవి కన్న కవిరాజశిఖామణి నన్నిచోడదేవుని కుమారసంభవములోని రతి ఎన్నోరెట్లు మిన్నయని పేర్కొనినారు. ఈ విషయమంత ఆలోచించి అనినట్టిది కాదేమో! దేవకార్యమును పూని శివతపోభంగము చేయనెంచిన మన్మథుని రతీదేవి వారించుటను నన్నెచోడుడు మనోజ్ఞముగా వర్ణించిన మాట వాస్తవము. కాని మన్మథుడు భస్మీభూతుడైన పిమ్మట రతి విలాపమును వర్ణించుటలో కాళిదాసుని మార్గమునే నన్నిచోడుడును అనుసరించినాడుగదా! మఱి నన్నిచోడుడు చిత్రించిన రతీదేవి కాళిదాసు వర్ణించిన రతీదేవికంటె యెన్నోరెట్లు మిన్నయగుటెట్లు?

మహాభారతేతిహాసంలో కురుయుద్ధానికి కారకులైన ముఖ్యపాత్రలలో కుంతీదేవి యొకతె. ఆమె మనస్తత్త్వమును, వాత్సల్యమును వర్ణించుటలో తిక్కన అనన్యసామాన్యమైన ప్రజ్ఞను నిరూపించుకొనినాడు. రాయబారమునకై వచ్చిన శ్రీకృష్ణుడు కుంతీదేవి యాతిథ్యము స్వీకరించినాడు. అప్పుడు

### వ్యాకరణ బోధిని

6, 7, 8 తరగతుల వ్యాకరణ పాఠం పుస్తకం. రచయిత—శ్రీ నిష్ఠల సర్వమంగళేశ్వర శాస్త్రి. పుటలు—98. వెల 1—00. ప్రాప్తిస్థానం—రచయిత, బహుళార్థ సాధక పాఠశాల, పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా.

### శ్రీమదాంధ్ర రఘువంశము

పద్యకావ్యం: ప్రథమాశ్వాసం. రచయిత—శ్రీ దురిశేటి వేంకట రామాచార్యులు. పుటలు—80. వెల—2—00. ప్రాప్తిస్థానం—అప్పారాయ గ్రంథమాల, నూజివీడు, కృష్ణా జిల్లా.

### గౌరీ శతకము

రచయిత్రి—శ్రీమతి లలితాంబ. పుటలు—24. వెల—తగు తపాలాబిళ్లలు పంపిన పుస్తకము పంపబడును. ప్రాప్తిస్థానం—శ్రీమతి కె. లలితాంబ, 3/49, రెండవ రోడు, అనంతపురం.

### స్తోత్ర త్రయము

రంగనాథ సుప్రభాతం, నారాయణ హృదయం, వేంకటేశ సుప్రభాత ప్రపత్తులలోని శ్లోకాలు—వీటికి తెలుగుసేత, రంగనాథ సుప్రభాత, నారాయణ హృదయాలకు టీకా తాత్పర్యాలు కూడా వున్నాయి. మూలశ్లోకాలు ఎడమప్రక్కన, కుడిప్రక్కన అనువాదం ఉన్నాయి. అనువాదకులు—శ్రీ కె. నారాయణరావు. పుటలు—80. వెల—1—00. ప్రాప్తిస్థానం—శ్రీ కె. నారాయణరావు, (రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్), గూడవారు, నెల్లూరుజిల్లా.

### గేయ సంపుటి

బాలలను ఉద్దేశించిన భక్తిప్రబోధ హాస్యశృంగారాది గేయాలు. రచయిత—శ్రీ పురాణపండ కామేశ్వరరావు. పుటలు—104. వెల—1—50. ప్రాప్తిస్థానం—పురాణపండ 'చిత్ర', ఆధ్యాత్మ ప్రచారక సంఘం, భారద్వాజా, రాజమండ్రి.

### ఆవేదన

అస్పృశ్యతానివారణోద్దేశమైన పద్యకావ్యం. రచయిత—శ్రీ ఎస్. ఎం. యార్. పుటలు—66. వెల 1—00. ప్రాప్తిస్థానం—భగవాన్ పబ్లిషింగ్ కంపెనీ, నంద్యాల, కర్నూలుజిల్లా.

### పరాభవ శిశిరం

గేయసంపుటి. రచయిత—శ్రీ కాళోజీ నారాయణరావు. పుటలు—32. వెల—తగిన పోస్టేజి పంపాలి. ప్రాప్తిస్థానం—శ్రీ కాళోజీ నారాయణరావు, నక్కలగుట్ట, వరంగల్—1.

### శ్రీ శంకర హృదయము

రచయిత్రి—శ్రీమతి సంకా సీతామహాలక్ష్మి. పుటలు—62. వెల 1—00. ప్రాప్తిస్థానం—సాధన గ్రంథమండలి, తెనాలి.

### శ్రీ విశ్వనాథ సుప్రభాతం

సంస్కృతం, దేవనాగర లిపి. సంపాదకుడు—శ్రీ శ్రీకంఠం దక్షిణామూర్తి. పుటలు—24. మూల్యం—అధ్యయన మాత్రము. ప్రాప్తిస్థానం—శ్రీ శ్రీకంఠం నందీశ్వర్, గోస్పాద్, వయా నంద్యాల (ఆర్. ఎస్.), కర్నూలు జిల్లా.

### శ్రీ కన్యకా సుప్రభాతం

సంస్కృత భాష. అష్టోత్తరనామావళి, జయపతాక, మంగళగీతికాసహితం. రచయిత—శ్రీ జమిలి నమ్మాళ్వార్. పుటలు—54. వెల 0—50. శ్లోకాలు తెలుగు, దేవనాగరి, తమిళ లిపులలో ముద్రించడం దీని విశిష్టత. ప్రాప్తిస్థానం—కన్యకా పరమేశ్వరీ దేవస్థానం కమిటీ, గుంటూరు.

### అహింసా మూర్తులు

స్త్రీ పాత్రలేని కార్మిక సమస్యా నాటిక. రచయిత—శ్రీ కారెపు అప్పలస్వామి. పుటలు—52. వెల—1—00. ప్రాప్తిస్థానం—విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2.

### మధురాంజలి

కనిగిరి మార్తాండ లింగేశ్వర స్తవరూపమయిన అష్టోత్తరశత పద్యావళి. రచయిత—శ్రీ విప్పగుంట రాజగోపాలరావు. పుటలు—30. వెల—భక్తిప్రపత్తులు. ప్రాప్తిస్థానం—శ్రీ సీలిశెట్టి చెంచయ్య, ఎం. ఎ., ఎల్. ఎల్. బి., కనిగిరి, నెల్లూరుజిల్లా.

### రంగురంగుల పూలు

పూవులను గురించి పిల్లలకు వైజ్ఞానికంగా తెలిపే కథ. రచయిత—శ్రీ యండమూరి సత్యనారాయణరావు. పుటలు 88. వెల తెలియదు. ప్రాప్తిస్థానం—ఉత్తమసాహితి, పున్నమ్మతోట, విజయవాడ.

### వెలుగు పూలు

పిల్లల గేయాలు. రచయిత—శ్రీ సమతారావు. పుటలు—36. వెల 0—50. ప్రాప్తిస్థానం—విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2.

### బ్రాహ్మణుడు

ప్రాచీన బ్రాహ్మణుని గుణాలు తెలిపే కావ్యం. శ్రీ కలుగోడు అశ్వత్థరావు. పుటలు 108. వెల—2—00. ప్రాప్తిస్థానం—కవిరాజ ప్రింటర్స్, రాయదుర్గం, అనంతపురంజిల్లా.

### సరస్వతీ సాక్షాత్కారము

పద్యకావ్యం. రచయిత—శ్రీ అనుముల కృష్ణమూర్తి. పుటలు—84. అమూల్యం. దాతలకు ఉచితం. ప్రాప్తిస్థానం—యువ భారతి, 5 కింగ్స్‌వే, సికింద్రాబాద్.

### బసవగీత

కన్నడంలోని బసవేశ్వర వచనాలకు గేయరూపమైన అనువాదం. అనువాదం—శ్రీ ముదిగొండ శివప్రసాద్. పుటలు—86. వెల 1—00 ప్రాప్తిస్థానం—మేనేజర్, వి. వి. హాస్టల్, హైదరాబాద్—27.

### లాల్‌బహాదురీయం

పదునెనిమిది పద్యాల కావ్యం. రచయిత-శ్రీ ఎం. రంగకృష్ణమాచార్యులు. పుటలు—170. వెల 5-00 ప్రాప్తిస్థానం. మెదకుమండల రచయితల సంఘం, కోహీరు, మెదక్‌జిల్లా.

### ఆమె కోరిక

కథల సంపుటి. రచయిత్రి శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి. పుటలు 156. వెల 2—50.

### నీలాటి ఒకరు

నవల. తమిళ మూలం : శ్రీ జయకాంతన్, తెనుగు అనువాదం: సాక్షి. పుటలు 120. వెల 2—00.

### బాల గేయాలు

రచన—'సమతారావు', పుటలు 80. వెల 1—25.

### తత్వశాస్త్ర సంక్షిప్త చరిత్ర

మూలం—క్లియుబిక్. అనువాదం—శ్రీయుతులు ఏటుకూరి బలరామమూర్తి, నిడమర్తి ఉమారాజేశ్వరరావు. పుటలు 100. వెల 1—70.

### చిన్నారి పాటలు

రచన—మనూనా—ఘనపమూర్తి. పుటలు 50. వెల 0—75.

### గేయకవులు

రచన—'సమతారావు', పుటలు 102. వెల 1—50.

### జాతీయగీతాలు

వందేమాతరం మొదలు నేటివరకు పలువురి రచయితల గేయాల సంకలనం. పుటలు 96. వెల 1—00.

### సోషలిస్టు సమాజపు ఆర్థిక ప్రగతి

మూలం—ఎస్. మకరోవా. అనువాదం—శ్రీయుతులు టి. ఎల్. నరసింహారావు, తుమ్మల వేంకటరామయ్య. పుటలు 110. వెల 1—70.

పై ఎనిమిది పుస్తకాల ప్రాప్తిస్థానం—విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2.

### చిట్టి జంతువులు

కొన్ని అడవిజంతువుల స్వభావం బొమ్మలతో సహా పిల్లలకు తెలిపే పుస్తకం. రచన, చిత్రాలు—శ్రీ ఎర్గేనియ్ చరూషిన్. పుటలు 12. వెల తెలియదు. ప్రాప్తిస్థానం—ప్రగతి ప్రచురణాలయం, మాస్కో.

---

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1.**
**Editor : S. Sambhu Prasad**

Bharati June 7 th 1967 Regd. No. M. 1856

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
| --- | --- | --- | --- |
| 4 వ కవరు పేజి | ... | రు. 175/— | రు. 150/— |
| 2 లేక 3 వ కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 150/— | రు. 125/— |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 125/— | రు. 100/— |
| అర పేజి | ... | రు. 65/— | రు. 55/— |
| పావు పేజి | ... | రు. 40/— | రు. 35/— |

ప్రత్యేక స్థానములకు 25 అదనం.

నెల నెలకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
| --- | --- | --- |
| సంవత్సర చందా | ... | రు. 12—0—0 |
| 6 మాసముల చందా | ... | రు. 6—0—0 |
| విడి ప్రతి | ... | రు. 1—0—0 |

మేనేజరు, భారతి.

మద్రాసు—1.